# పీ ఠి క.

---

1. శ్రీమ దఖండపాండితీమండితవిద్వద్దండులారా! నాటకములలో శాకుంతలముంబోలె భాణములలో నీముకుం దానందము నందఱు నభినందింతురే గదా! దీనిం జెంగల్పూరు బ్రహ్మశ్రీ చంద్రశేఖరశర్మగారు ౧౮౮౨-వ సంవత్సరమునఁ జెన్నపురమున నచ్చొత్తించినప్రతిముఖపత్రిమును బట్టి యీ కృతి శాలివాహనశకము ౧౩౦౦ గల హేవళంబికి సరియైన ౧౩౩౮-వ సంవత్సరమున రచింపఁబడినట్టు పొడకట్టుచున్నది. ఏయాధారమువలన నీశకము నిర్ధారణ చేసిరో తెలియకున్నది. కాలము నిట్లు నిర్దేశించుటకు లిఖితమూలము లైన నేయితరాధారములు నా కిప్పటికి లభింపవు. ఐనను గ్రంథకర్త కర్నూలుమండలములోని బంగనపల్లెజహాగీరునం గలక్రొత్తపేటలోఁ బెద్దకాలమునకు ముం దుండిన ట్లీప్రాంతములవాఁడుక కలదు. ఈక్రొత్తపేటకు మిగుల సమీపముననే నందవరికుల కిలువే ల్పగు శ్రీచూడేశ్వరీ చూడేశ్వరులు నెలకొన్న భద్రగిరిప్రతీతి గలమిట్టతోఁ గూడ నందవర మనుపుర మొకటి యున్నది. భాణప్రస్తావనలో నధికపాఠమునఁ గవిపూర్వికులలో నొక రగునయ్యలుసోమయాజులు శ్రీవీరభద్రనృపతి వలన నంద్యాలాగ్రహారము వడసిన ట్లున్నది. నంద్యాల కర్నూలుమండలములోనిదే. నంద్యాలకుఁ గ్రొత్తపేట (నూతనపురము) దక్షిణమున దాదాపు ౨౫ మైళ్ళదూరమున నున్నది. కాఁబట్టి కవి బంగనపల్లెలోనిక్రొత్తపేట (నూతనపుర) నివాసి యని దృఢంబుగఁ జెప్ప నొప్పు.

2. తార్కికాలంకారికవిద్వద్వరిష్ఠుఁడును గవికులతిలకుఁడు నగునతనియీసరసాలంకారవ్యంగ్యచమత్కారభావగర్భము లలితపదసందర్భము నగుముకుందానందభాణమును బండితసార్వభౌము లగుమిత్త్రులప్రోత్సాహంబున నా తోఁచినట్లుగఁ దెలిఁగించితిని. ఇందలిలోపములం దయతో మన్నింతురు గాత.

క. కొని గుణదోషంబుల బుధ
జనుఁ డిందుని విషము నొందు♦శంకరుఁ డటు లా
దిని శిరమున గొనియాడును
వెనుకది కంఠమునఁ దాల్చు ♦ విశ్వము మెచ్చన్.

ఇట్లు
అఖిలవిద్వజ్జనవిధేయతముఁడు,
కర్నూలు. గని శేషయశాస్త్రి.

శ్రీరస్తు.

# అంకితము.



ఉ. శ్రీలలనాశ్రయం బగుచుఁ ♦ జెన్నగుపిల్లలమఱ్ఱియందు బే
తాళవరంబునం బొదిలి ♦ ధారుణి నంతయుఁ జెవ్విరెడ్డి బే
తాళసమాఖ్య ముఖ్యముగఁ ♦ దాలిచె నంచని కావ్యపంక్తి వే
నోళులఁ బల్కు విక్రమఘ♦నున్ బ్రభు యత్కులమూలభూతునిన్.

ఉ. ఆయతకీర్తివిక్రముఁడు ♦ యాచమనాయకుఁ డాజిఖడ్గనా
రాయణ పాండ్యరాజగజ♦రాజవిఘాలన పీర దుష్టభూ
నాయకకుంజరాంకుశ జ♦నవ్రజకల్పక మానదానరా
ధేయ ముఖాంకుఁ డేకులము ♦ తేజరిలం జనియించె నాదిలోన్.

సీ. వరరసార్ణవసుధా♦కరసదలంకృతి
గ్రంథ మెవ్వనిచేత ♦ గ్రథిత మయ్యె
నరయ సంగీతర♦త్నాకరవ్యాఖ్య యే
పార్థివేంద్రునిచేతఁ ♦ బ్రహిత మయ్యెఁ
దగ మల్లినాథవి♦ద్యానాథకృతిటీక
నేఱేనికీర్తి వి♦స్తృతిని గాంచెఁ
బోతనకవికృత♦భోగినీదండక
మేఱేని ప్రీతికై ♦ హృద్య మయ్యెఁ

గీ. బ్రోచె దేవరకొండను ♦ రాచకొండ
మనిచె శ్రీనాథకవి బహు♦మతుల నేఁడు

శ్రీలరేచెర్లసర్వజ్ఞ ♦ సింగభూపుఁ
డాప్రభుం డేకులమ్మున ♦ నయ్యె జగతి. ౩

సీ. అందు శ్రీలకుమార♦యాచమనాయని
గారిప్రపౌత్త్రితఁ ♦ గాంచె నెవఁడు
అవనీశబంగారు♦యాచమనాయని
గారిపౌత్త్రిండయి ♦ గలిగె నెవఁడు
పార్థివసర్వస♦ర్వజ్ఞకుమారయా
చమనేనికొమరుఁడై ♦ యమరె నెవఁడు
రేచెర్లగోత్రవా♦రిధికిఁ జింతామణి
కరణి విక్రమకీర్తిఁ ♦ గాంచె నెవఁడు

గీ. మేటి యాశ్రీమహావెలు♦గోటివంశ
చంద్రవేంకటకృష్ణయా♦చేంద్రనృపతి
కంకితం బయ్యె నీకృతి ♦ యఖిలరసిక
పండితకవీంద్రజనములు ♦ ప్రమద మొంద. ౪

సీ. ఆరాజగోపాల♦యాచేంద్రబహదరు
ల్కే. సి. ఐ. ఇ. పదులు ♦ వాసిఁ గొలుపఁ
బారి రామకృష్ణరా♦వుబహాదరులుగారు
కడగంటి చూపులఁ ♦ దడుపుచుండ
శ్రీమహావేంకట ♦ శ్వేతాచలపతిరం
గారావు బహదరు ♦ ల్గారవింప
ఘనులు మానురభివేం♦కటలక్ష్మరావుబ
హద్దరుభూపాలు ♦ రాదరింప

గీ. సాంద్రరమ ముద్దుకృష్ణయా♦చేంద్రు లరయఁ
గృపను శ్రీవేణుగోపాల♦కృష్ణయాచ
మేంద్రుఁ జూచుచుఁ బ్రజఁ బ్రోవు ♦ మెల్లకాల
మవని నాచంద్రతారార్క ♦ మైనకీర్తి. ౫

క. అనునభినవాశ్రితుఁడ బుధ
ఘనకరుణాహితుఁడ నతుఁడఁ ♦ గౌండిన్యమహా
మునిగోత్రుఁడ విప్రుఁడ నే
గని శేషయశాస్త్రి పేరఁ ♦ గాంచినవాఁడన్. ౬



శ్రీ

# ముకుందానందభాణము.

## ప్రస్తావన.

[నాంది]

క. వందారుకమందారున
కిందుశిరోనందనునకు ♦ నిభవదనునకుఁ
మందాన్యానందలస
త్సందోహున కే నొనర్తు ♦ శతవందనముల్. ౧

క. జనసంక్రందను రఘునం
దను హరకోదండచండ♦దండకలితఖం
డను జానకీమనోనం
దనచందనుఁ గూర్చి చేసె♦దను వందనముల్. ౨

మఱియును.

చ. ఎదుర గళోపగూహనపు♦టింపు ఘనస్తనపూర్ణభోగసం
పద కటిసంగసౌభగము ♦ మత్ప్రియలందు సతంబు నొందెనం
చదికెనయీర్ష్య నా బలిమి ♦ నాయమునాతటి గోపికాశుభా
స్పదపటరాశిఁ దాఁగొనిన♦ప్రౌఢుఁడుకృష్ణుఁడుమిమ్ముఁబ్రోచుతన్.

ఇంతియ కాదు.

చ. హరునలికాక్షి చల్లవడ ♦ నబ్జసుధాంశుకణంబుల న్మను
ల్తగుణులఘోరచూపుల ని♦తాంతము తొందర నంద లీలఁ బూ
ల్శరములుగాఁగ వంజెఱకు ♦ చాపముగాఁగఁ ద్రిలోకవీరుఁడై
స్మరుఁడు రతీశుఁ డింపెసఁగెఁ ♦ జాల యథేచ్ఛముగాఁగ నంతటన్.

[నాందియైనమీఁద సూత్రధారుఁడు]

సూ.—(ఎదురం గని సంతోషముతో) నేఁడు గదా తొలినుండి కడవ
ఱకు మాపురాకృతపుణ్యాలతలు ఫలించినవి! ఎందున కన,
నిచ్చోటనే క్రొత్తపేఁటప్రాంతము నలంకరించుభద్రగిరిచూడా
మణి యగుభగవంతుఁ డైనచూడేశ్వరునివసంతోత్సవము నిరీ
క్షింప నిచ్చగించి యున్నసామాజికులు కల్యాణమండపమధ్య
మునఁ జేరి యున్నారు. అందున న్వారిం జేరి నాచిరపరిచితలా
స్యకల నాలోకింప వినయమున నభ్యర్థింతును.

(పరిక్రమించి యక్కటితోఁ గేలు మోడ్చి) ఓసకలకలా
కలాపకోవిదు లగుసభాసదులారా! ఏఁడు భరతాచార్యపు
త్త్రుఁడు సకలకలాప్రవీణుఁడు ఆత్మవిద్యాప్రదర్శనముకొఱకుఁ
బూజ్యుల రగుమీయనుగ్రహము నడఁకువతోఁ గోరుచున్న
వాఁడు.

(ఆకాశమునఁ జెవి యొగ్గి) ఏమనుచున్నారు. "బాగు భర
తాచార్యపుత్త్రా బాగు! మేమును, ఒకానొకసరసకవిచేఁ బలుకు
ముత్తియంపురతనమ్ముల విరచితం బగు నూతన మిశ్రభాణముఁ
దిలకింపఁ దమకించుచుంటిమి. అందున నట్టిదానినే యొకభాణ
మును నేఁ డభినయించి చూపు మనియా."

అనుగ్రహింపఁబడితిని (తనలో) ఇప్పు డట్టిమిశ్రభాణము
నకుఁ బ్రచార మరు దైనది గదా! అట్టికవులు గూడఁ బలుచ

నైనట్లు కనుపట్టుచున్నది. ఈసత్తములయుత్తరువును మహాత్తరంబుగదా! ఎట్లు? అశక్యసంఘటన మేర్పడెను.

(తలఁపు నభినయించి) ఓహోహో! నేఁ బ్రణయకలహకుపితగృహిణీమనోవినోదనాసక్తచిత్తుఁడనై మఱచినను సామాజికకరుణచే మఱియు ననతిచిరాభ్యస్తమైనదానికరణి నట్టిరూపకమె తలఁపునకు వచ్చుచున్నది. కానీ, యింటిదానినే పిలిచి చెప్పెద. (ప్రకాశమున) ఆర్యా ఇటు రమ్ము.

[నటి ప్రవేశించి]

నటి.—ఆర్యా! ఇదిగో వచ్చితిని. ఏమాజ్ఞ? ఆర్యు లాజ్ఞాపింతురుగాత.

సూ.—ఆర్యా! నీ కిది తెలియునా?

సీ. శ్రీవీరభద్రుఁ డ♦ న్యూభవల్లభుండు నం
ద్యాలనామక మ♦గ్రహారకంబు
యదుద్భూతరాజితా♦య్యలుసోమయాజిర
త్నంబుచే ఘననాయ♦కం బొనర్చె
మహితసజ్జ్యోతిష♦మండలమండన
కౌండిన్యకందసం♦కలిత మేది
వంశ మున్న దది సు♦పర్వధూర్వహమహా
ధర్మోదయోదార♦ధరణి యాచు

నటి.—గీ. ఎఱుఁగ నేమి దీని ♦ నెందునఁ బుట్టిన
జ్ఞాననిధుల నిగమ♦సారవిదుల
పూర్వసుకవు లిట్లు ♦ పొగడుచుందురు వేల
సంఖ్య మీఱ శ్రోత్ర♦సరణిఁ బడఁగ.

మ. ధరభిద్దంతి దిశాగజంబుల బలెం ♦ దాఁ దాల్చుచు న్వైబుధిన్
ధుర వేదాంతిగజేంద్రుఁ డిద్ధత తగ ♦ న్నూరిభపంక్తి న్మదో
ద్ధురదుర్వాదిమృగేంద్రు గెల్చి కుముదుఁ♦డుచ్చ న్మృగేంద్రాత్తస
త్కారిదుష్కీర్తిని జాలమట్టునకు వి♦ద్వత్కోటియూ నౌ నన్.

మఱియును.

శా. శ్రీరంగేశ్వర స్వోక్త్యధీనతఁ గనన్ ♦ శేషుండు నీవెంతయున్
సారంబు న్నతిమందరాద్రిఁ దరవ ♦ న్సారస్వతాంభోధి నిం
డారంగాఁ గవితామృతంబు కృతిసే♦వ్యం బయ్యె నవ్యంబు కృ
త్త్రాదిశ్రీసుమనోమనోబ్జముల కా♦హా గొల్పదే సద్రుచిన్. ౭

ఇంతియ కాదు.

చ. బలమునఁ గామదేవుని స♦భాస్థలి గోమహిమం జయించి తి
ర్మలధరణీధరేశ్వరుఁడు ♦ మన్నన నియ్యఁ ద్రిలోకజేత నాఁ
గలుగునవాఖ్య శంకరుఁడు ♦ గాదినిబోలె గ్రహించినాఁడ వీ
యిలపయి యల్లయాజి సముఁ ♦ డెవ్వఁడు నీకిల సద్బుధాళిలోన్.

ఇం కొకటి.

సూ.—చాలుంజాలు నతివిస్తరమయ్యెను. ఉన్నవి వేనవే లిట్లనవద్యములగు పద్యములు. వానివలన నేమి? అనంతరపద్యోపశ్లోకితుఁ డెల్లదీక్షితుఁడు గదా! అతని మనుమఁడును ఉమాపతిపండితపుత్త్రుఁడును.

క. మానితకౌండిన్యకుల
ప్రాణుఁడు కాశీపతికవి ♦ యతనికృతి ముకుం
దానందమిశ్రభాణము
పూని ప్రయోగింత మతివ ♦ పూర్ణముగాఁగన్. ౯

అందువలన నిచ్చట (అను నర్ధోక్తిలో)

నటి.—ఆర్యా! అచ్చెరు వచ్చెడువు!

క. అగుచుండు నతనిపలు కా
రఁగఁ గర్కశవక్రనిష్ఠురము తర్కమునం
దగ మధురససందర్భం
బగు కావ్యమునందు లలిత మగు నేరీతిన్. ౧౦

సూ.—(పరిహాసముతో) నీవే చెప్పుము మఱి

క. ప్రణయాగ్రహమున నీ వా
క్షణము కఠినవైన మఱియు సత్ప్రేమరసా
ర్పణసార్ద్రహృదయవై మృదు
ఘ శీతిం గొంటి నటు లతని భారతియుఁ బ్రియా. ౧౧

నటి.—ఒకపలుకే మృదులము కర్కశము నెట్లగు నని యడిగితిని. ఆర్యు లేమేమో వక్కాణించెదరు.

సూ.—ఇట విరోధ మేమున్నది? ఆకవి నేను చెప్పుకొని యున్న వాఁడు.

మ. కటువై కర్కశవక్రవాగ్గహనతర్కంబందు నాపల్కు దె
క్కటియౌచున్మృదులోక్తిసారసురభింగావ్యంబున న్ప్రీవ్యమా
నెటు లన్నం బ్రియవిప్రయుక్తవనితాహృత్కర్తనం గత్తెరై
యటఁ బూబంతి వరోపలాలితకుఁ గాదా కోమలం బెంతయున్.

నటి.—ఆకవిపలుకు కుసుమశ్రీవలె మృదులమా!

సూ.—మృదు పీవాగ్గతి ఫుల్లపుష్పరమకున్నే ర్దీయనర్థక్రమం
బది మందప్రసరన్మరందమునకున్ వ్యంగ్యంబు సౌరభ్యసం

పదకుఁ సంగత మింకఁ గోయిలలకు ♦ ల్పదర్ఘ్య లంచత్స్వరుల్
గద పీరికవి యూవపంతునకు నే ♦ కశ్లాఘ్యుఁ డిచ్చోఁ గనన్. ౧౩

నటి.—(అంతట విలోకించి) ఆర్యుఁడా! యీప్రక్కఁ జూడుము చూడుము. ఈమామిడితోట వసంతాగమమును దెలుపుచున్నది.

* క. కిసలయకరసంపుటమునఁ
గుసుమాంజలి నాడు చెమటఁ ♦ గొని తీవ యిడెన్
శ్వసనహతతాళదళతా
ళసమంబుగఁ బాడె భ్రమర♦లక్షయుఁ బేర్మిన్. ౧౪

సూత్ర.—ఆర్యా! చక్కఁగ నిరూపించితివి. ఇటుప్రక్కఁ గూడ.

ఉత్సాహ. మందమారుతాగ్రచలిత ♦ మంజుపల్లవముల మా
కందవీరుధమ్ము పిల్చు♦కరణిఁ గ్రాలె రక్తిచే
నంది కోకిలమ్ము పల్కు♦నట్లుగాఁ గుహూయటం
చొందెఁ బక్షపాతయుక్తి ♦ నూని దాని మెల్లఁగన్. ౧౫

మఱియు నిక్కడను జూడుము.

చ. స్తనకలశప్రగల్భతల ♦ సత్సుమగుచ్ఛము దాల్చెఁ దేంట్లు మూఁ
క నిడి మదాలసత్వమునఁ ♦ గాంచెను వేణిసిరిన్ సరాగరీ
తిని జిగురాకు మేల్పెదవి♦తీరును బొందెను మొల్లతీవయుం
గనియె ఋతుప్రభావమునఁ ♦ గామినివిభ్రమ మిప్పు డందునన్.

ఆర్యా! మన యదృష్టవశమున నన్నియు నమరియున్నయవి.

---

* క. అళిపులకలరవతాళా, కలరుతి కనుసరణఁ బాడుఁ ♦ గోకిలసతి యా
టలఁ గుసుమాంజలిఁ జల్లుఁ గి, సలయాపుకరసంపుటమున ♦ సరిలత యెదుటన్.

మ. కవి కావ్యజ్ఞబుధేశ్వరుల్ ఖరౌఁ బికమృదూ ♦ క్తశ్లాఘ్య మీవేళ రా
ధవిటుం డంగజతంత్రడి కావ్యపతి యా ♦ తం డీసభాస్తారులున్
భువి సారజ్ఞులు మేము నాట్యమున నే ♦ ర్పుం గొంటి మిం కిద్ది శ్రీ
నవచూడేశ్వరునుత్సవంబు వెలయున్ ♦ నానార్థముల్ సేకుతన్.

కనుక నీ విట సంగీతము ననుష్ఠింపవలయును.

నటి.—క. కాకకులకఠినినిస్వన
మాకలితముగా ముహూర్త ♦ మటు విడిచి తగన్
గోకిలతరుణుఁడు రమ్య
శ్రీకలితదళాగ్రమలతికఁ ♦ గ్రీడించు నొగిన్. ౧౫

సూ.—(తలపంకించి) ఔరా! సంగీతమాధుర్యము.

(తెరలో)

గీ. మగఁడు మేలొక్కని యిటుఁ గూయు ♦ మాడ్కి త్రోఁచె
నకట వంచించె విధి యసి ♦ యాడి దైవ
మూర్చి నేఁ జేతఁ దనచెఱఁ ♦ గూన నూడ్చి
కదలె నాప్రియ యెట్టులు ♦ కటకట యిఁక. ౧౬

సూ.—(విని తెరవంకఁ బరికించి) ఇతఁడు మందరోద్యానవనగతుఁడై మంజరి నెడఁబాసినభుజంగశేఖరుఁ డనుభగవంతుఁ డగుముకుందుని వేషము ధరించిననామాతులేయుఁడు మధుకరుఁడు గదా ఇటుప్రక్కకే తిరుగుచున్నాఁడు గనుక మనమును దరువాతిపనులకు సిద్ధంపడి యుందము రమ్ము. (అని నిష్క్రమించిరి)

ఇది ప్రస్తావన.



[అంత ముందు చెప్పినరీతిని భుజంగశేఖరుఁడు ప్రవేశించును]

భుజం.—("మగఁడు మేల్కాని" యనుపద్యమును మరలఁ జదువుచు నాలోచించి) అప్పుడే నే నా

క. స్ఫుటఘనపులకకదంబముఁ
దటుకునఁ గుచకలశయుగళిఁ ♦ దాఁకుచును మదో
త్కట ననమధుమధురాధర
పుటబింబము నేల వేగ ♦ ముద్దిడ నైతిన్. ౨౦

(మరల నాలోచించుకొని) అప్పు డింతటి కైన నెట్లవకాశ ము? ఎందున కన

ఉ. కోమలశాద్వలంపుఁబొదఁ♦కుం బడ మొందెను లేదొ నేర్పుచే
నామెయిఁ జాటువాక్యముల ♦ నాడెనొ లేదొ యొకింత యింగిత
ప్రేమసమేతసామిగను ♦ దృష్టిని జూఁపెను లేదొ దైవమా
భామినిభర్త లేచెఁ గద ♦ పాపవశంబున నంతలోపలన్. ౨౧

దురదృష్టవంతుఁడ నగునేను మాత్రము.

చ. పులకవదూరువం దునుతు ♦ మూర్కొని మోమనుతమ్మిఁ గొఁగిట
న్నలుమచుఁ జన్నుదోయి వెస♦నొక్కుదు బిత్తరిపంజుమోవి విం
తలఁ జెవిఁ జెప్ప నేమియొ వ♦దల్చెద నీవి నెపాన నంచుఁ గే
వలవిఫలాశలన్నిశను ♦ బల్మఱుఁ బుచ్చితి నొచ్చితిం గదన్. ౨౨

లేక యూగడచినవానిం జింతింప నేల (నిట్టూర్పు విడిచి) ఈ యుద్యానవనమున నే మరల నా ప్రోడ.

ఉ. ఊరువు లెక్క బల్మి వెస ♦ నూడిచి నీవిని మేఖలాకలా
పారవభీతి మందచల♦నాలసమధ్యమమై రతిశ్రమో

దాగయు నల్పకూజితయు ♦ దష్టరదచ్ఛదయై మఱింత నా
కోరికఁ దీర్పదే మరలఁ ♦ గోమలి యెల్లి యొయెల్లి యుండియో.

(క్షణమాత్ర మాలోచించి) చాలు నీయనాగతకాలావగాహిని యగువాంఛావాహినియును. మఱేమన్న నింతవఱకు నన్నుఁ దగియున్నది.

గీ. అసితకుంతలభూషిత ♦ మాయతాక్షు
మరుణదశనచ్ఛదచ్ఛద ♦ మల్పహాస
మలఘుపీనకుచం బని♦ తావలగ్న
మతివయంగమె యెదుట నా♦కరయ మెఱయు. ౨౪

(తలంపునకుం దెచ్చుకొని) అల్పభాగ్యుఁడ నగునాకిదియును దుర్లభమే. ఏల యనఁగా (ఆకసమున) ప నీవు.

* క. పతియింటఁ బడితివి గద యు
వతి వెంటనె వాగురో♦వలయగహారిణీ
గతి నంటఁగఁ గల వింకే
గతి నాకంటి తెరు వలఁతి♦గతిఁ బ్రేయసిరో. ౨౫

(కన్నీటితో)

చ. పలుసులు నూఁతగా భవద♦పాంగవిలాసతరంగపంక్తి యం
తలిగినమారు నెంచి తృణ ♦ మట్లు స్వధైర్యత నుంటి వానిచే
నిలిపితి శంక వీడినను ♦ నీ విపు డేమిఁకఁ జేయఁ గాంతరో
గలుగు నెవండు రక్షకుఁడు♦గా గతి యేది వచింపు మెంతయున్.

---

* క. అతికంటకముగ నుండిన, మృతిపంటం బడినపాల్కి ♦ మొదల కపుడె నీ
పతియింటఁ బడితి వింకే, గతి నాకంటఁ బడఁగలవు ♦ కామిని మరలన్.

మరల ("వానిచే నిలిపితి" మొదలుగాఁ జదువుచున్నాఁడు)

(తెరలో)

చ. ఉదయకుభృత్సమీపమున ♦ నుష్ణకరుం డుదయించె నల్లదే
యదె యమృతాంశుఁ డస్తగతి ♦ నందెను బాపి భవద్వియోగముం
మదిని సహింప కల్లదిగొ ♦ నాతి సమీపము చేరె నీకు నె
మ్మది గను మింక శోకమును ♦ మానుము కోకము సద్వివేకమా.

భుజం.—(విన్నట్లభినయించి సంతసమున గన్నులనీటిం దుడుచుకొని) ప్రియావియోగవిక్లబమై శోకారవముఖరముఖ మగు నింటికో నేటిజక్కవపిట్ట నెల్లమెల్లనూఱడించు మక్కువ నీమందారుండు మంజరీవియుక్తుఁడ నగు నన్ను నాశ్వాసించువాఁ డయ్యె (ఆత్మం గూర్చి) హృదయమా! ధైర్యము నొందుము. ఈ యుపశ్రుతి యవశ్యముగఁ బ్రియాసమాగమం బొనగూర్చును. (అని యా లోచించుకొని) మంజరిమగఁ డైనమాధవునకుఁ బయనము నేఁడే నిర్ణీత మైనది. ఈమంజరిని వెంటఁ బెట్టుకొన కెట్లు వెడలును? (సవిమర్శముగ) పైయుపశ్రుతివలన మగనికిమాత్రము పయనమును ఆనాప్రియురాలి కిచ్చటనే యునికియు సూచిత ములగుచున్నయవి. ఇందువలన నాకన్నివిధములను బ్రియాస మాగమము గలుగవలెను. (మఱియు నిట్టూర్పు విడిచి) ఏమి యిది! అకృతసుకృతుఁడ నగునా కసంభావనీయమే సంభావ నకు వచ్చుచున్నది!

గీ. చాలఁ గాలము మదనాగ్ని ♦ సంతపింపఁ
గలయ నిప్పు డెట్లొకో మాకుఁ ♦ గలిగె నిచట
సంతలోపలఁ బతి యొకఁ ♦ డడ్డ మయ్యె
నైన నాకోర్కి సంత్రాత ♦ మయ్యె దీన.

తలఁ

లేక,

గీ. బయలు వెడలఁడె నాథుఁ డే ♦ పనికి నైన
నిచట నేఁ జూడనే మఱి ♦ యిందుముఖిని

(గద్గదస్వరముతో)

గటకటా! యింతలోపలఁ గాముఁ ♦ డేచి
యమునివలెఁ గ్రూరుఁడై మర్మ ♦ మంట గ్రుచ్చు. ౨౯

(కొంచెము ధైర్యమవలంబించి) ఇతఁ డొక్కపెట్ట నేను నామీఁదనే.

గీ. మరుఁ డశోకామ్రకుముదాబ్జ♦మల్లికాశు
గముల విడిచిన సమసంఖ్య ♦ గల్గునట్టి
సతికరాధరనయనాస్య♦చంద్రహసిత
బాణముల ననుసంధింతు ♦ వార కేను. ౩౦

(అని యాసారసలోచననే మానసమునఁ దలంచుకొనుచు) ఏమి సేయుదు? ప్రియురాలినే ధ్యానించుచున్నను విరహపారావారముం దాఁట లేక యున్నాఁడను. ఏల యన నాప్రియత మయును

గీ. చిఱునగవుతోడఁ దీయని♦చిగురుఁబెదవి
బీదనడుమునఁ గుండకుఁ ♦ బెనుచనుఁగవ
మెఱుపుఁ బోలినతనులత ♦ మెలఁత తలఁప
నాత్మ నలరించు విదిలించు ♦ హరిణనయన. ౩౧

(కొంచెముగ నవ్వి) మదీయహృదయదుశ్శీలత వింతగ నున్నది! ఏలయన నట్లైన నిది.

మ. అది పాదాంబుజ మూఁడుయుగ్మ మది మ♦ధ్యం బద్ది శ్రోణీస్థలం
బది యాపాటి యురోజరీతి యది నా♦భ్యావర్తగాంభీర్య మ
య్యది మో మద్ది యపాంగముగ్ధవలనం ♦ బవ్వే వినీలాలకా
లదియ న్నం చెద వాఁడు నిల్వదు తదీ♦యాంగమ్ములం దెంతయున్.

(స్పర్శసుఖ మభినయించి) ఏ మిది విభావరి ప్రభాతప్రాయ
మైనది

చ. మునుపటిగంధపుంజపరి♦పూర్ణసమంచితవాయువుల్ మొగి
డ్చినకుముదంపుగర్భములఁ ♦ జిక్కినవో యన పీవకున్న వో
య్యన నవసౌరభంబు లగు♦నంకురవాయువు లివ్వి వీచు న
వ్వనఁ దగుపద్మినీరమణి ♦ ఫుల్లముఖాబ్జమునుండి వచ్చు నాన్.

(పడమటిదిక్కు మొగమై) ఇతఁ డిక్కడ

చ. జరఠమరాళమో యనఁగ ♦ జర్జరితాగ్రమయూఖపంక్తి ని
ర్భరగతిఁ బశ్చిమాంబునిధి♦పారమున న్నెల జాఱె

(పైవంకఁ జూచి) ఇట మఱియు దానియం
బరపతయాళు లీఁక లనఁ ♦ బల్చనఁ బల్చనఁ గాంచుకాంతులన్
బారలుచు నున్న వే మనినఁ ♦ బొందగుతారక లచ్చు టచ్చుటన్.

మఱియును

గీ. గగనజలనిధి నెలతెప్పఁ ♦ గడఁగి నిలిచి
పఱచి వెన్నెలవలత్రాళ్ళఁ ♦ బడినయట్టి
చుక్కలనుచేఁపగుంపులఁ ♦ గ్రక్కునఁ గొన
నంకదాశుఁడు చరమాద్రి ♦ కరుగు నిపుడు. 3౫

ఇంతియ కాదు.

గీ. గగనవనమున రాత్రి♦గా మృగాంకుఁ
డడఁగి నక్షత్రసేనతో ♦ నటఁ గరాగ్ర
లగ్న పాంథులఁ గొందఱ ♦ భగ్నపఱచి
ప్రొద్దు వొడిచినఁ బఱవెత్తి ♦ పోవు నిపుడు. ౩౬

వెండియును

ఉ. తారలకాంతి మాపుచు ని♦తాంతపుశోణిమ తూర్పుదిక్కు వి
స్తారము సేయుకాంతితతి ♦ శంక లొనర్చుచుఁ బ్రొద్దుపొడ్పుగాఁ
జేరును గుంపుచీఁకటులు ♦ చెందినభీతిని దేఁటు లన్నపం
బారఁగ నీలపద్మజఠ♦రాంతరసీమ నటంచు నెంచెదన్. ౩౭

అందువలన నే నీ నిష్కుటవనము వెలివలని కిప్పుడ వెడల
వలయును. (అని లేచి యింటిప్రహరిగోడ నెగిరి దుమికి తోట
లోఁ బడి మేడలజాడలం గని)

గీ. కలపి యొక్కొక్కటై దండ ♦ మెలపి యట్లు
సరసపృథులోరుశాఖల ♦ దరశిథిలత
నంటి మేనుల మధురబిం♦బాధరంబు
నాని యానక కౌఁగిట ♦ నలముకొనుచు. ౩౮

గీ. భూరినిశ్శ్వాసవేగవి♦స్ఫురితగురుకు
చద్వయోద్ఘటనశ్రులై ♦ స్తతులరతుల
శ్రాంతులై కామిజను లిట ♦ ససుఖముగను
జాలఁ బుణ్యమునఁ బరుంద్రు ♦ లీలతోడ. ౩౯

మఱియు మఱికొంద ఱచ్చోటనే

సీ. నీవితో వసనంబు ♦ నిశ్శేషముగఁ దీసి
గజ్జె లింపుగఁ గాంచి ♦ గల్లుమనఁగ

నడుము క్రీడాందోళ♦నమున ఖిన్నత నొందఁ
జనుఁగవ యించుక ♦ చలన మందఁ
దఱచు కుండలములు ♦ తాండవం బొనరింప
నంచితంబుగ విక్ర♦మించి బడలి
కన్నుఁదమ్ములు కడ ♦ మిన్నక ముకుళించి
కాంతలు కాంతవ♦క్షముల వ్రాలి
గీ. రమ్యగతి మించునట్టిపీ♦రాయితముల
సౌధపారావతంబులు ♦ సాంతముగను
గంఠకలకూజితంబుల♦కరణి మరలఁ
బల్కు నట శిష్యభావంబు ♦ కొలుపునట్లు. ౪౦

(కొన్నియడుగులు నడచి) ఎవఁడు వీఁడు కమలాపీడునింటి కోటం దిగి పర్యాయస్ఖలితచరణుఁ డగు తరుణుం డీదిక్కునకే యెదురు నడచుచున్నవాఁడు? (చక్కఁగాఁ జూచి తెలిసికొని తనలో) నాసఖుఁ డగువసంతకునకన్న నన్యుఁ డెవ్వం డిట్టినడవడులం గడ ముట్టినవాఁడు?

(ప్రకాశముగ) మిత్త్రమా! వత్స వసంతకా! ఎక్కడ చాలఁ గాలమునకు నాకన్నులం జల్లపఱచితివి.

(దిగులుడగ్గుత్తికలతో) ఏమనుచున్నావు? చెలికాఁడా! మెల్లమెల్లన మాటాడు మనియా?

వయస్యా! నీ కెవనివలన నీభయము?

ఏమనుచున్నావు? కమలాపీడునివలన ననియా?

సుహృన్మణీ! భీతి నొందకుము. (అని కైదండఁ గొని) ఉండని కమలాపీడులశతమును సహస్రమును.

గీ. జిష్ణు వైనను విధి యైన ♦ విష్ణు వైనఁ
బూసి యలికాక్షుఁ డాయష్ట♦మూర్తి యైన
నాదుసఖుఁ దాఁక నడుగంగఁ ♦ గాదు కాని
కడకుఁ జూడంగ నోర్వను ♦ గట్టి నమ్ము. ౪౧

(కొన్నియడుగులు నడచి) ఏమిది యిప్పటికిని వడఁకుచునే యున్నావు! ఏమంటివి?

గీ. ఉద్యదుగ్రాసిచంచలా♦యుతకరాగ్ర
నుద్భ్రమచ్ఛోణితాతిశో♦ణోగ్రదృష్టి
దండధరచండు నాతని ♦ దండఁ జూచి
కటకటా! యేఁడు వడఁకఁడో ♦ కాని చెపుమ. ౪౨

అనియా?

నిజము నిజము కమలాపీడుఁ డట్టివాఁడే. ఐనను దూరము నం దున్నవాఁడు. నినుఁ గనుంగొనం బోసంగదు. లేక ఇవి ప్రియవయస్యనిస్వప్నవిజృంభణములుగా నుండ పలయును.

ఏమనుచున్నావు? నేనణుమాత్ర మైన నిట నసృతమాడను జుమూ! నిజమే వాఁడు దూరమునం దున్నవాఁ డనుట. నే నప్పుడే యాబోటిచేటిమాటనలన నాటికొన్ననమ్మకమ్మున నాసర సిజనయనం గలసి మెలసి యసమశరసమరరససంభృతమాన సుఁడనై మునుపటియటు లాయావిలాసముల నావిలాసపదన మునఁ బవడంపుకోళ్ళతెరమంచమున జంకు కొంకు మాని శయనించి నెమ్మదిగ నీరాత్రి యంతయుఁ గడపితిని. ఈనీచుఁడు కమలాపీడుఁడు ఎప్పుడు వచ్చి కనుపడకుండఁ దనపడఁతుకనడ నడిక నొడియఁగట్ట నెయ్యెడ డాఁగుకొనినదియు నే నెఱుంగను.

అంత నిశాంతమున సద్దు గాక యుండ నే నానిశాంతమునుండి వెడలుచు నంగణగతు నాఘాతుకుం గని యెఱింగితిని. అనియా ?

హితతమా ! కష్టము మిగులఁ గష్టము ! మఱి యెట్లు తప్పించుకొని వచ్చితివి ?

ఏమనుచున్నావు ?

చ. కరమునఁ గత్తిఁ బూని ననుఁ ♦ గాంచి వధింపఁగ బైటితల్పు స
త్వరముగ మూయునంతకును ♦ దాఁటి యదృష్టముచేత నెట్టులో
తొరపడి కోఁటదారిఁ గొని ♦ దూఁకి మహాహాన్నతసాల మావిన
శ్వరఖలు బారిఁ దప్పి యిట ♦ వచ్చితిఁ జుల్కనగా నటంచు నా ?

అదృష్టమున మరలఁ బుట్టినట్లు చెలికాఁడా !

ఏ మనుచున్నావు ? మఱింత ప్రాణరక్షకుఁ డగుమిత్త్రుం జూచుట ననియా ?

కాని గాసి నిలు నిలు. (విన్నట్లభినయించి) నెచ్చెలీ ! కమలాపీడునిగీమునం గలకలం బాదవుచున్నది. ఏమది ?

(గద్గదస్వరముతో) ఏమనుచున్నావు ? నిజముగ నాకరవాలకగుం డగుకమలాపీడుండు ఆనాప్రాణవల్లభం గలవాణిం గీటడంగించెం గాఁబోలు ! అందున నం దుదయించినయమందపరిజనాక్రందనం బిది ! ఓసికలవాణీ ! అయ్యో ప్రియురాలా ! కటకటా ! నానిమిత్తమున నీ కీజీవితఘాత వాటిల్లెనా ? మదీయప్రాణవల్లభా ! పతివ్యపదేశము నందినమహాపాతకియగు మృత్యువు ని న్నీగతి దుర్గతి నొందించెనా ? లేక, పతి నేల నిందింపవలయు ? నన్ను నేన నిందించుకొనఁదగి యున్నవాఁడ.

చ. కరభుజగంబులం బొడివి ♦ కంఠముఁ బ్రాణము లానఁ బ్రేమ య
గ్గరళము నించితిం దరుణి ♦ గాత్రమునం దది కానిచో సుధో
త్కర మయి మున్ను నీతనువు ♦ త్వత్పతిదృష్టికి నింతలోన న
ట్లురుతరకోపపాత్రముగ ♦ నెప్పు న దెట్లు విచిత్రరీతిగాఁ. ౪౪

అనియా?

వయస్యా! కలకలమాత్రమునఁ గేవల మధీరునివలె నోర్వ
రానిశోకాగ్నిం బడి నీప్రాణముల నీవు లెక్కింపకున్నావు.

ఏమనుచున్నావు? నాకును బ్రాణములయం దనభినివే
శమా? ఏ నేను.

మ. పతి కోపించిన నేమి సేయు దయితఽ ♦స్వప్రాణనాడిం జగ
త్త్రితయైకాద్భుతజీవరత్నమును నీ♦రీతిం గుతర్కాత్తతం
గృతహంతం జడబుద్ధి జాల్చి నపకా♦రి న్నన్ను నేఁ బ్రోవఁ జూ
చితి దాని న్మఱి గావ నైతి నబలం ♦ జిన్నారిఁ బ్రాణప్రియఁ.

అనియా?

(తనలో) ఏ మిది వయస్యునిశోకవేగ మప్రతీకారముగ నేర్ప
డెను! ఏమి యిట నింకఁ జేయవలయు? కాని యిట్లు చెప్పి
చూచెదను.

(ప్రకాశముగా) స్నిగ్ధుఁడా! దానివిషయమునం గమలాపీడుఁ
డెట్లు ప్రవర్తించినడియుఁ జూడకయే కేవలకలకలముచేత నేదో
యొక యమంగళము నూహించుకొని పలుకుట గాని తలఁకుట
గాని పొగులుట గాని యనుచితము. అందున నం దేగి యా
కలవాణివృత్తాంతము సాంతముగ నిజము దెలిసికొందము రమ్ము.
(అని కొన్ని యడుగులు నడచి చూచి) సవయస్యా! కష్టాంతర

నిష్కృత్తకృపాణద్వితీయుం డైనవీఁ డెవండై యుండ నోపు? సగము గప్పినముసుఁగు గలతలతోఁ ద్వరగా వచ్చుచున్నవాఁడు.

(పరికించి) ఏమనుచున్నావు? వీఁడు నాయనుచరుఁడు కలకంఠుఁడు నన్నుఁ జూచినయుల్లాసమునఁ జెరచెర నెదురఁ బఱతెంచెడిని. నేన వీని నిన్నటియానిశీథమునఁ గలవాణివిలాసగృహముం జొచ్చునప్పుడు నాయసిలత నొసంగి ముసుంగిడి కక్ష్యాంతరమున నాకాపుదలకొఱకే యుంచితిని. అనియా?

కాని వీనినే యడుగుదము. ఓరీకలకంఠా! ఇటు రా రమ్ము.

(కత్తి నుత్తంసించి నమస్కరించి) ఏమనుచున్నావు? దేవరవారిచెలికాఁ డైనమాయేలిక ప్రాణములం దనపాదములయంద యుంచుకొని నమ్ముకొనినజనమ్మును గూడ విడిచి తన్నుఁదా రక్షించుకొనుటచే మంచిపనిఁ జేసినవాఁడు అనియా?

(తనలో) ఏమిది? చెలికానియెడ నుపాలంభనపరుఁ డైన వీఁడు కలవాణిపట్టునఁ గొంచియ మశుభమును సూచించుచున్నాఁడు.

(ప్రకాశముగ) ఓరీ! మూర్ఖుఁడా! ఇప్పుడే దుఃఖించుచున్న వీని నుఱింత నరుంతుదవచనముల దుఃఖపఱచెద వేమి?

ఏమనుచున్నావు? తమవయస్యుఁడు వగ నొందుచున్నాఁడేమి? అనియా?

వసంతకా! ఏమనుచున్నావు? నిజవల్లభ యైనకలవాణిం గమలాపీడుఁడు చంపుచుండఁ గాపాడువార లేరును లేరైరిగదా! అనియా?

కలకంఠా! ఏమనుచున్నావు? మఱేమి ఏవారును రక్షించినవారు గారు.

(అనునర్థోక్తియందు) (వయస్యా! (కన్నీటిడగ్గుత్తికలతో) ఏమనుచున్నావు?

చ. కువలయమాల నాసమెయిఁ ♦ గూరిమితోడ విహారలీల నీ
దవుగళమందు నుంచితిఁ గ♦దా చెలి యీకరయుగ్మ మెత్తి యా
నవభవ మంటుబంగరుట♦నంటిరుచిం దగుబొందె నా సమా
ర్ణవ మగుకంఠ మ ట్లసిల♦తాకశినాహతిపాత్ర మాయెఁగా. రఘు

అనియా?

(తనలో) ఎట్లీస్నేహితు నూఱడింతును?

చ. పలుకక యున్న నిర్ఘృణత ♦ వాయుము శోక మనం గఠోర వాఁ
బలుమ ఱేఁ కేల శోక మను ♦ వాక్యము నింద సదానుశోచనన్
బల మగుఁ బూర్వశోక మది ♦ నమ్మినమిత్త్రులు శోకవంతు నే
వలసుననూఱడింతురొయు♦పాయముతోఁపదుమిత్త్రిఁదేర్పఁగన్.

(ప్రకాశముగ) అసంగతప్రలాపి యగువీనినుడి కడవఱకు వినక హితుఁడా యిటు విలపించుట యయుక్తము.

ఓరీ! ఏమనుచున్నావు? ఇది యిట్లే. ఇతఁడు నామాట తుదముట్ట వినఁడు అనియా?

కాని పూర్ణముగానే చెప్పుము.

ఏమనుచున్నావు? అవధరింతురుగాత. ఇఁక దీని నిట్లు సాంతముగఁ జెప్పుచున్నాను. ఆపెను దనబుద్ధి యొక్కటి దప్ప నెవ్వరును రక్షించినవారు కారనియా?

వింటివా? వయస్యా! నీప్రియవల్లభ తనబుద్ధిచే రక్షింపఁ బడినట్లు చెప్పినట్టాయెఁ గదా! కాన నీయమంగళదుఃఖము నిఁకఁ జాలింపుము. ప్రకాశముగానే యడుగుదము (అనియుత్తరీయపుఁజెఱఁగునఁ గన్నీరు దుడిచి కలకంఠుం జూచి)

ఓరీ! కలకంఠా! అదియు నెట్లో తప్పించుకొని సౌభాగ్యవీధిం బ్రవేశించె నేమి? అచ్చట స్వైరిణులు పతికిఁ గాని క్షితిపతికిఁ గాని భీతి పడవలసి యుండదు.

వయస్యా! ఏమనుచున్నావు? అట్లామదనమదకరిణి యగు నాతరుణీమణి గణికాసరణికి దిగినయెడ నప్పుడు

గీ. చందురుని ముద్దుఁ గొనుమేడ♦యందుఁ దూఁగు
మౌక్తికవితానమంచసీ♦మను బరుండి
యురముపై నెప్పుడును జెలి ♦ నునిచి నేను
రాత్రిదినభేద మెఱుఁగని♦రతి వసింతు. ౮౪

అనియా?

కలకంఠా! ఏమనుచున్నావు? దేవరా! అది యట్లయగును.

ఉ. దానిఘనస్తనద్వయము ♦ దానివిలాసవికాసినేత్రముల్
దానిముఖాబ్జసంపదయు ♦ దానివినీలపుఁగేశపాశముం
దానిసదారుణాధరము ♦ దానిస్మితంబును మించఁ గాంచఁ దా
నేనరుఁ డెట్లెఱుంగు దిన♦మిద్ది దినం బని రాత్రి రాత్రిగాఁ. ౮౫

అనియా?

అట్లైన మఱి యప్పుడాకలవాణి యేమి చేసినది?

ఏమనుచున్నావు? దేవరా! ఎప్పుడీతఁ డింటనుండి వెడలి వేగముగ గృహావనమార్గమునఁ గదలెనో యప్పుడే నేర్పరి యగు నాపె తనసొమ్ముల నులిచి యెచ్చటనో దాఁచి ఆసొమ్ము మోఁదు

కొనుచు « అదె యదె చోరుఁడు నాయాభరణమ్ము లపహరించి పరువెత్తుచున్నాఁడు. అయ్యో! చచ్చితిసి. అక్కటా! దిక్కు లేదయ్యో. దూరదేశమునుండి జేపు నామగండరుదేర నే నేమని చెప్పుకొందును? ఏమి సేయుదును? గతి యేది? కాచువాఁ డెవ్వఁడు?" అని మిగులఁ బొగులుచు నశ్రుధారాకీర్ణలోచనయై యింటనుండి బయలువెడలెను అనియా?

(సబహుమానముగ) బళిబళి కలవాణీ! సెబాసు! వయస్యా! నీప్రేయసిపతివ్రతానుసరణచాతురి వింతయైనదిగదా! ఆవల నావల.

ఏ మనుచున్నావు? అంత నప్పు డాకమలాపీడుఁ డంతయుఁ జోరవిలాసమే కా నెదం దలంచి, « ఓ హృదయవల్లభా! భయాకులవు కా వలదు కావలదు. నీప్రాణరక్షకుఁడు కమలాపీడుఁ డిదిగో సమీపించె" నని పలికి కరవాలపాణియై యాగృహోపవనమునే ప్రవేశించె. నే నంతలోన ధాన్యశూన్యభాండము నుండి మెల్లన వెడలి దేవరచరణసన్నిధి కరుదెంచితిని. అనియా?

నెచ్చెలీ! ఆనితంబిని నీపురాతనసుకృతవిభవమున నీయాపద నపనయించుకొనెను.

ఏమనుచున్నావు? దానినై పుణ్యాపుణ్యాసంపదచేత నే యని చెప్పవలయును. అనియా?

కాని నీవు గోరినయట్లే కానిమ్ము (అని కొన్నియడుగులు నడచి వ్రేలితోఁ జూపుచు) ఇ దెవతి? ఏ యిది

ఉ. ఇంచుక జాఱుచీరముడి ♦ నెత్తి కరంబునఁ దాల్చి యూర్పులన్ సంచలితమ్ముఁ జన్నుఁగవఁ ♦ జక్క నమర్చుచు మాటిమాటికిన్

గొంచిక మీఱ నల్దెసలఁ ♦ గొంకుచుఁ జూచుచు నగుచున్న దీ
చంచలనేత్ర వేగమున ♦ జాఱుచు మ్రొగ్గుచు సారెసారెకున్. ౧౦

ఏ మనుచున్నావు? ఇది రత్నగుప్తునికోడలు, దీనిం గుఱు
తెఱుంగవా? అనియా?

అట్లైనం గుఱుతించితిని. ఇది కదా!

మ. పని యున్న న్వాలి కేఁగ దెప్పు డౌరుఁ ద్రో♦వం జూడ దచ్చంపుసా
ధ్వని బోలుం గురుసేవఁ దప్పదు పతిం ♦ బ్రీతాంతరుం జేయు న
త్తను సేవించు నిశీథవేళకడ ♦ నిద్రం జెందఁగా నెల్ల రం
గన తా నేగి విటాళితోఁ గలసి యే♦కాంతంబ క్రీడించెడిన్. ౧౧

ఏ మనుచున్నావు?

క. నెలఁత యిది యొకతియే కాం
తలలోనన్ ధన్య సుఖము ♦ తగుశీలంబున్
వెలయఁ బవ లతిపతివ్రత
కులసతులన్ రాత్రి యైనఁ ♦ గులటలఁ గలయున్. ౧౨

అనియా?

వయస్యా! బాగుగఁ జెప్పితివి! (తిరిగి చూచి), చూడు
చూడు. ఇట నిది.

క. తనబొటనవ్రేలితోఁ ద
ర్జనితోఁ గొని పెదవిఁ జూచు ♦ జనుల న్మఱియున్
జనుఁగవఁ బయ్యెద నెత్తుచుఁ
గనుఁ బుణుకుం జింతసేయుఁ ♦ గామిని కంటే. ౧౩

ఏమనుచున్నావు? నెచ్చెలీ! ఇటఁ జూడుము చూడుము.

ఉ. ఊరువ్రులం జలించెడుకు♦చోపరిచేలచెఱంగుఁ జక్కఁగాఁ
జేరుప జాఱుకొప్పుముడిఁ ♦ జేరుపఁ జేతులు సాఁప జాఱఁగాఁ
జీర యొకింత లోలమణి♦చిత్రితకాంచిక సంటి నాభికా
సారము మందమందముగ ♦ సర్వజనేక్షణమోదదం బగుఙ్. ౫౮

అనియా?

(మఱియొకదాని నిర్దేశించి)

మ. అరయఙ్ శోణితశోణకోణచపల♦వ్యావృత్తతారేక్షణం
బురుసీత్కారచలాధరం బతివమో♦ ముద్భ్రాంత హూఁ గావునఙ్
చరమాంగప్రతిలగ్నతాంతకతిచి♦చ్ఛయ్యాప్రసూనంబులఙ్
మరుఁడే రంధ్రిగవేషి బాణతతిఁ గ్రు♦మ్మం బోలు నా నెంచెదఙ్.

(క్షణమాత్ర మాలోచించి) ఏమనుచున్నావు? వయస్యా! వంచన సేయక నిజమే చెప్పనెడఁ గొంచియ మడుగుచున్నాను.

అనియా?

పూర్వ మెప్పుడైన నే నిజము కానిమాటం గొంచెము సెప్పియుంటి నేమి? ఇప్పుడు నట్లే నచింతు ననుటకు.

ఏమనుచున్నావు?

క. అంగము కృశ మగుచున్న ద
పాంగము నిద్రాలయంబు♦పద్ధతి దెల్పుం
బొంగెడునూరుపు లివియుఁ గ
నంగ భవద్విరహాశిఖిఘు♦నత్వము దెలుపుఙ్. ౫౯

దీనికి హేతు వే మనియా?

(తనలో) నే నెంత దాఁచుకొనియున్నను ఇతఁ డెఱ్ఱింగెను? (ప్రకాశముగ) హేతు వున్నది (చెవిలో నిది యిట్లని)

ఏ మనుచున్నావు? ఇప్పుడ యిప్పురీపురోహితపుత్త్రి స్వాతి హోత్రు నాశ్రయింపుము. అనియా?

ఇప్పు డాశ్రయింపవలసిన దేమున్నది? అతఁడు నాకు బాల్య మిత్త్రుఁడు.

ఏమనుచున్నావు? అట్లయిన నీవలన వృత్తాంత మంతయు వినినవెనుక నా కార్తాంతికశిరోమణి తాన యేదియో• యొకయం తరాయమును సూచించి దానికిఁ గాంతని శ్శాంతమునకుఁ బయన మనువృత్తాంతమును సలుపును. అనియా?

స్నిగ్ధోత్తమా! బాగుగ నాలోచించితివి. ఇప్పు డప్పురోహిత సుతుఁ డెక్కడ నుండును?

(విమర్శించుకొని) ఏమనుచున్నావు? నియతముగ దేవతా ర్చనకొఱకుఁ బువ్వులఁ గోయుటకై పురోద్యానమం దుండును అనియా?

కలకంఠా! ఏ మనుచున్నావు? దేవతార్చనకొఱకుఁగాదు. చేటికార్చనకొఱ కనవలయును. అనియా?

ఓసీ! దుర్మతీ! పూజార్హులవిషయమునను ఏదో కొం చెము వదరుచున్నావే!

ఏమనుచున్నావు? ఇతఁడు పూజార్హుఁడా? ఎట్లగు?

క. ఇల శాంతిహోమబలిక
ర్మల దక్షిణ యనుచుఁ గొన్న ♦ మాడలను బణం
బులఁ జేసి చేటికాపద
జలజములకు వందనంబు ♦ సలుపుం దినముల్. 72

అనియా?

వయస్యా! ఏమనుచున్నావు? ఇది నిజ మనియే తలంప వచ్చును.

ఉ. చిమ్మనుచీఁకటింటిగోడఁ ♦ జేరి శ్రమం గనులార్చు చల్ల సా
యమ్మునఁ గొన్నదక్షిణల ♦ నాఁచి పణమ్ముగ సాని నిద్దురం
గ్రమ్మెడుదాఁకఁ గొల్చి తగ ♦ రాఁ బనికత్తియ లింటి కంతకుం
బొమ్మ లసం బురోహితుల♦పుత్త్రిలు వేఁగుదు రందు రాత్రులన్.

అనియా?

(ఉపహాసముతో) సవయస్కా! నీ వెఱుంగవు.

గీ. కలరు గొందఱు పురి గణి♦కాని శాంత
ఘటితఘటచేటికావిటుల్ ♦ గాని నాదు
సఖుఁడు పరయోషిదున్నత♦స్తనకరీంద్ర
కుంభపరిరంభముల ఱొమ్ముఁ ♦ గొమరుపఱచు. గీ

అందున నే నుద్యానవాటిం జేరి పౌరోహితతనూజు నన్వేషించెద. హితతమా! నీ వెచ్చటి కేఁగుచున్నావు మఱి?

ఏమనుచున్నావు? వేశవాటిక కనియా?

నీవేఁగెడు దారులు సుఖకరము లగుం గాక. (కొన్నియడుగులు నడిచి)

ఇదిగదా! అడ్డము లేనిపొగరుమిగులున నుప్పొంగి మించు నించువిలుకానివింటిటంకార మనుశంకం గ్రమ్మించుతుమ్మెదకొద మలరొదల ముఖరము లగుశిఖరములును, లలితరసాలకిసలయాంకలనమహితపరభృతకులబహుళకోలాహలములుం గలిగి మంద మందస్యందమానమకరందబిందుసందోహపరిపూరితకుసుమపరా

గపరంపరాకల్పితాలవాలరేఖ యగువనరేఖ ప్రకాశించుచున్నది. (వనప్రవేశ మభినయించి చూచి) ఇచట

క. కుసుమరజస్సైకతమధు
రసవాహినుల న్మిళింద♦రాజి సమంద
శ్వసనపటుకర్ణధార
ప్రసవప్లవముల విహార♦రతిఁ గ్రీడించున్. ౬౦

వేఱుదెసఁ జూచి ప్రభాతపర్యంతము పౌరజారిణు లిందె విహరింతురు కాఁబోలు నదెట్లన,

చ. అవి స్మరకేళిభగ్నవల♦యమ్ములు పల్లవతల్ప మిద్ది యా
యవి చికురాపతత్సుమము♦లారుపరిష్కృతభూమి యిద్ది యా
యవి పదలిప్తలక్తకము♦లయ్యది విస్మృతహారయష్టి యా
యవి కమనాళిపాదకమ♦లాంకనధన్యతమస్థలంబులున్. ౬౧

(కొన్నియడుగులు గడచి) ఉద్యానపాలిక యగుమరాళిక యా యేమిది? ఓసిచెలీ మరాళికా! మామిత్త్రుఁ డైనవీతిహోత్రుఁడు కుసుమాపచయమున కిచ్చట నచ్చి యున్నవాఁ డేమి?

ఏమనుచున్నావు? మఱేమి? ఇప్పుడే పూలపుటికం జేత నిడుకొని దక్షిణపుదిక్కుపాదపంక్తిం బ్రవేశించెను. అనియా?

సరి. అదే మార్గము చూపుము. ఏమనుచున్నావు? ఇటు లిటులు అనియా?

(కొన్నియడుగులు గడచి) ఓసకియా! చూడుము చూడుము.

క. ఏగతి మరందపూరా
భోగం బానరించు నామ్ర♦భూజం బిది తా

నాగతి సదాగతియును బ
రాగముతోఁ బెంచుఁ గాదుఁ ♦ బ్రబలముగాఁగన్. ౬౨

నిర్దేశించి

గీ. భూరిసుమరసపరిమళ♦పూర మగుచు
ధీరగంభీరభృంగఝుం♦కార మైన
మంజులరసాలపుంజన♦కుంజమందు
సరసులవిహారములు మీఱు ♦ సరసముగను. ౬౩

ఏ మనుచున్నావు? అయ్యా! ఎఱుఁగుదును. అనియా.
(దానినే మరలఁ జదువుచున్నది.)

(మఱియు మఱియొకదిక్కు నవలోకించి విషాదముతోడనే)

మ. తమి సీనిష్పతితోష్ణబాష్పసలిలా♦తాన్తాంకురశ్రీకకుం
జమహీ న్వల్లభవిప్రలబ్ధవనితా♦సంక్లృప్తమై భాసురా
సమబాణాసినికృత్తగాత్రపతిత♦స్త్ర్యానామివ ప్రోచ్ఛ్రయ
క్రమమై శయ్య యశోకపల్లవయుతిం ♦ గాన్పించు నిచ్చోటునన్.

ఏమనుచున్నావు? ఇటు చూడుము. భవద్వయస్యుఁ డితఁ
డనియా!

(చూచి సంతసమున) ఏమిది వయస్యుఁ డెదుటనే కనఁబడు
చున్నవాఁడు.

గీ. పూలపుటికచేతఁ బూనఁగఁ ♦ గొమ్మ నటీడ్చి
వెంట లేవఁ డేఁటి♦వితతి గనుచుఁ
గుడికరంబు నెత్తి ♦ గోరంటపువ్వులఁ
గోయు నితఁడు చూడఁ ♦ గోరినతఁడు. ౬౪

(సద్గతి) మిత్త్రమా! (అనునర్ధోక్తిలోననే త్వరపాటుతో కొమ్మ విడిచి క్షణకాల మీాక్షించి) ఏమనుచున్నావు? ఆప్తుఁడా! ఇపుడు నిన్ను గుఱుతించుటే యశక్యమైనది! ఎందువలన ననఁగా.

గీ. చెక్కిళులఁ దెలుపెక్కెఁ గృ♦శించె మేను
కరము మఱి పండుమోవియుఁ ♦ గమలెఁ గన్నుఁ
గవయు మిపులంగ వాడెను ♦ గానఁ బసునిఁ
గాఁ దలంచితి నిన్ను నేఁ ♦ గాదె యిపుడు.

ఇంతియు కాదు.

చ. తుహిన నవాశ్రుపూర మర ♦ దోఁపఁగ రక్తిమ మీఱ నెంతయున్
మురుఁగుట తెప్ప లప్రసర♦ముం గొనుచూపుల నొప్పుచున్న నీ
వెడఁదవిలోచనద్వయము ♦ వే దెలుపు న్వివరంబుగా మదిం
బడఁతివియుక్తిదుఃఖ మతి ♦ భారముగాఁ గల దంచు నా కిటన్.

అంమన మంజరి మగనిగీమున కేగె నేమి? అనియా?

(తనలో) చెప్పకమున్న నాయీారహస్య మీాతం డెట్లెఱింగెను? లేక, దైవజ్ఞులకుఁ దెలియని దేమున్నది? (ప్రకాశముగ) తాము జ్యోతిష శాస్త్రదృష్టివలన మచ్చరిత మెఱింగితి రేమి?

క. అక్కమలలోచనను న
న్నక్కడ నిష్కుటవనంబు ♦ నందుఁ గలుపునా
యొక్కజెగావతి యను చెలి
దక్కఁ బరుం డెఱుఁగఁ డెట్టి తఱి ♦ నెవఁడైనన్. ఉరా

(నవ్వి) ఏమనుచున్నావు? దీనిం దెలియుటకు జ్యోతిశ్శాస్త్రవీక్షణాపేక్షయుఁ గావలయునేమి? ఏలయన?

గీ. ఎంతగా దాఁచినను బర♦కాంతలరతి
కొన్ని దినములలోపల ♦ మిన్ను ముట్టు
లోఁతు గలసిటిబురదలోఁ ♦ బాత నైన
వెలికిఁ జామరతీవియ ♦ వెడల కున్నె. ౬౯

అనియా?

అట్లగు నేని మఱి యేమని యాపద్మముఖిం జుట్టలు నిందింపరు? మఱియుం బరిహరింపరు?

ఏమనుచున్నావు? ఇట్లనకుము

క. అందఱుఁ గల యీసుచరిత
మంద తెలుంగుదురు గాని ♦ యారూఢిమెయి
న్నిందింపరు నిపుణులు నీ
రందఱును బరస్పరము భ♦యంబు కలిమిచేఁ. ౭౦

అందునం గొన్ని దినములలో నది తాన యాబంధుగులబలఁగమునుండి తొలఁగఁగలదు. అనియా?

(ఊర్చి) ఇప్పుడ యాహరిణాక్షి శార్దూలవదనమునుండి తొలఁగఁ గలిగెనేని యామీఁద నంతయు నూహించుకొన వచ్చును.

ఏమనుచున్నావు? నీయం దమంద స్నేహము గలజట్టావతి నిన్నటిరాతిరియందే "వత్సా మందారదుహిత యగుమంజరి పతి మందిరకందరము చెందునది కాకుండునట్లు ముందుముందు యత్నపడవలయును" అని తెలిపినది; గనుక, భగవతి యగునా జట్టావతియుపదేశము మొదలఁ గలిగినది. ఈవల సుహృదునినిదేశము గలిగినది. ఈరెంటను మంజరీగమనప్రసంగభంజనము భవన్మనోంబుజరంజనము నవశ్యము నెఱవేఱుపవలసినదియే యనియా?

(తనలో) ఔరా! నాయందాభగవతికిఁ గలప్రసాదాతిశయము! ఇట్లు నే వేఁడుకొనకున్నను అనుయోగింపకున్నను దనంతఁబూనిక నూని నాకు మేలునే చేయుచున్నది. (ప్రకాశముగ) మాకొఱ కిట్లు కృతనిశ్చయుఁడ వగు నీవిషయముగ

క. తనయంత చతురుఁడై సహ
జనితప్రేమరసుఁడైన ♦ జనునిపయిం దాఁ
దనబరువు డించు వానికి
వినఁ జెప్పఁగఁ దగిన దేమి ♦ వేఱు గల దిఁకన్. 20

కాన నిప్పుడు త్వరతో నీవు వెడలవలయును.

ఏ మనుచున్నావు? ఇదిగో నేఁ బోయి వచ్చెదను. అనియా?

(చూచి) నామిత్త్రుఁడతిక్రాంతప్రమదవనప్రాంతుఁడయ్యెను.

మరాళికా! ఏమనుచున్నావు? ఇటఁ గమలమిత్త్రుఁడగు మిత్రుఁడును ఆక్రాంతపూర్వగిరి పర్యంతుఁ డయ్యెను. అనియా?

(ప్రాచి నీక్షించి)

గీ. వికసదంబుజనేత్రసం♦వీక్షితుఁడయి
కరముల రథాంగయుగకుచ♦భరము పుణికి
యల్ల యరుణప్రభాధర ♦ మైనవార
వనితముఖ మాని రవి యిప్డు ♦ పలుమఱుగను. 21

లేక,

చ. పలుమఱు రాత్రి యంత గడ♦వన్ లవణోదధిఁ ద్రావి యార్వ మీ
వలఁ దపనచ్ఛలంబునను ♦ వారక పిండుగఁ గట్టి వచ్చెఁ జు

క్కు లనెడుబుగ్గగుంపులను ♦ గాంచినమి న్నను వెల్లిఁ ద్రావఁగాఁ
దలపడి యంచు నాదుమదిఁ ♦ దథ్యముగాఁగఁ దలంతు నెంతయున్.

(ఎడమప్రక్కం గని)

గీ. విరియుతామర మొగ్గల♦వెలికి మెల్లఁ
బాఱుకడలేనితుమ్మెద♦బారుతీరుఁ
గనిన మారునిచే నున్న♦కత్తిసారు
నౌర యిటుఁ దలఁపించును ♦ దూరమునకు. ౭౮

ఏమనుచున్నావు? అందువలనఁ దేఁటికూటువుల బైటికి విడుచునది చలిదితామరగదా! అనియా?

అట్లైన నిపుడు వికసించుచున్నకమలములను గనుపఱుపుము.

(వ్రేలితో నిర్దేశించి) ఏమనుచున్నావు? దీని నాలోకింపు మాలోకింపు మేమన.

గీ. ఇందిరాసుందరవిహార♦మందిరమున
గంధతుందిలమకరంద♦బంధురమునఁ
గ్రందుకొనె ముంద రరవింద♦కందరమున
మందమందముగ మిలింద♦బృంద మిందు. ౭౯

అనియా?

(అని తలయూఁచి దానినే మరలఁ జదివి) ఏమిది అపూర్వముగనే చెప్పితివి సమసంస్కృతప్రాకృతపదహృద్య మగు పద్యమును!

(పద్మినిం గూర్చి)

గీ. లోకబంధుఁడు విభుఁ డను♦లోకవాద
మీకరగ్రహమున నింతె♦ యోకమలిని

భ్రమర మేశంక లేక తాఁ ♦ బవలు రేయు
ననుభవించును నీరస ♦ మధికముగను. ౭౬

లేక,

చ. తృణగణనంబునం దిరిగి ♦ సంభవమాది రజోభవాంతముఁ
దినములు మీఱెఁ దేఁటి యిది♦నీకయి యెప్డు ఋతూత్సవంబు గాం
చిన నిటు దక్షిణానిలుని♦చే నుపభోగముఁ జెంద లోక మే
మనుఁ గను మెట్టు లోర్చు నది ♦ యంబుజినీమణి నీవ చెప్పుమా.

(మగలఁ జూచి)

గీ. కలువపుప్పొడి బసుమంబు♦గాఁగఁ బూసి
సలిపి మధుపాన మేమేమొ ♦ పలికి పాడి
పద్మసద్మాంగణమ్ముల ♦ భ్రమరపంక్తి
పూని కాపాలికవ్రత♦ము నిది చొచ్చె. ౭౭

(మఱియొకయడుగు నడచి) ఓసీ! చూడు మఱి వీఁడు పౌరాణికుఁ డగుముద్గలభట్టు ఇటుప్రక్కకే వచ్చుచున్నవాఁడు.

ఏ మనుచున్నావు? ఎఱుఁగుదు నెఱుఁగుదు నీదొంగవిటుని. వీఁడు గదా!

గీ. చదువు నట్టట్టులు పురాణ♦సమితి సమితిఁ
జెప్పు నట్టట్టు లర్థంబు ♦ విప్పి ద్రిప్పి
చూచు నట్టట్టు చూపులఁ ♦ జూచి పలువ
బాలవిధవలు మదిఁ దన్ను ♦ వలచునట్లు. ౭౮

ఇది విను మఱి వీనిపేరు ముద్గలభట్టు అని కదా పిలిచెదరు. నిజమునకు వీనిపేరు చిదంబరభట్టు అనియా?

సత్యమే చిదంబరభట్టని తండ్రి పెట్టినపేరు. ఘూర్జరులు ముద్గలభ ట్టని ముద్దుపేరునం బిలిచెదరు. కాని గాని వీనితో మాటాడుదము.

(ఉపసర్పించి కుడిచేతి నె_త్తి) ఓ పౌరాణికో_త్తమా! భుజంగశేఖరుఁడు ప్రణమిల్లుచున్నవాఁడు.

ఏమనుచున్నావు ? సకలరతికలాకలాపదేశికుఁడ వగునీ యెడ నోచెలికాఁడా! యేమని నే నాశీర్వదింతును. అనియా ?

(అడఁకునతో) ఏమిది వట్టిమాటలతోడనే నీవు నాయెడ గౌరవము నారోపించుచున్నవాఁడవు !

ఏమనుచున్నావు ? నామాటలను గూడ వట్టివానిఁగాఁ దలంచుచున్నావుగదా ! సరి. నీమనస్సున నీవే స్మరింతువు గాని యిప్పుడు.

చ. నిలువఁ బరుండ నాడి నగి ♦ నేర్పి రహస్యము లాడ గొల్లత
ల్వాలవఁగఁ బిన్ననాఁడె రతి♦పాఠము నేర్పఁగ లేదె కృష్ణ యు
య్యాలపయి నూఁగుదంభమున ♦ నాటగ నీపయిఁ దీర్ప లేదె యు
చ్చలదలక స్తనాధరని♦తంబక మించుకరీతి బాలికల్. ౬౦

అనియా ?

కానిమ్ము. ఇప్పు డెవనిభవనమ్ము పావనమ్ము నొనరింప నుద్యమము ?

ఏమనుచున్నావు ? ఘూర్జరుఁ డగునిర్జరదాసుని గృహము ననియా ?

(తనలో)

గీ. కద కలావతినయనయు♦గం బహో
నిగళయుగరీతి నీతని ♦ నిలిపి కట్టు
గాన నేపని నైనను ♦ గాని మాని
పవలు రాతిరి వానిల్లుఁ ♦ బాయకుండు. ౨౧

(ప్రకాశముగ) అక్లైనం, గృహిణి నని వక్కాణింపవలయును.

ఏమనుచున్నావు. ఆ! ఆపె ంఱాజగంబునే పావనం బొ రింపఁ జాలువిశ్రుతసుకృతభరితచరిత గదా! అనియా ?

(కౌతూహలముతో) అక్లైనం దానిపవిత్రచరిత్రంబుం గొంత యొఱిఁగింపుము.

ఏమనుచున్నావు?

గీ. దానిమధ్యమంబు ♦ తద్విష్ణుపద మగుఁ
జన్నుదోయి యగును ♦ శైవపదము
వదనకమల మెన్న ♦ బ్రహ్మపదం బగు
నాతికచతతి సుమ♦నఃపదంబు. ౨౨

గీ. అధర మరుణధరమ♦హాస్థల మగును శ్రీ
రంగభూమి మేను ♦ రమణివాణి
మధుర నిర్జరులకు ♦ మాన్య యెప్పుడు దాని
పుణ్యచరిత మెంత ♦ పొగడఁ గలను. ౨3
అనియా ?

(బహుమానముతో) కనుకనే తా మింతగౌరవవంతుల రగు ట. కాసి గాని తమవిషయమునం దాని మనోవృత్తి యేరీతిగ నున్నది ?

ఏమనుచున్నావు? నెచ్చెలీ వింతగా నడిగెద వేమి? పురుషోత్తమదేవుఁడ వగుసీ కిడి సమర్పించెద ననునర్థము గలమంత్రముతో నావధూటి సాయంతనసీరాజనసమయమున వీటీకోటి నర్పించుచున్నది. అనియా?

నే నెఱింగినది మఱియొకటి కలదు.

గీ. ఉవిద ధర్మోపదేశగు♦రు పని సర్వ
వంచనను బాహ్యసేవనా♦వ్రతతి చేయు
లోన రతిదేశికుం డని ♦ తా ననంగ
తత్త్వమే నీకు నిజు గురు♦దక్షిణగను. ౧౪

(ఆదరణలేనట్లు) ఏమనుచున్నావు? ఇంతటనే నాకొదవిన సామ్రాజ్య మేమి?

గీ. గూఢకూర్పాసకుచపద్మ♦కుట్మలయుత
ఘూర్జరసతీరతిని మదిఁ ♦ గోరు నేఁడు
చోళదురుపద్రవాపేత♦చోళయువతి
పీనకుచగుచ్ఛమండలా♦ధీనకరుఁడు. ౧౫

అనియా?

(తనలో) జన మంతయుఁ దమజాతిరీతినే ప్రియముగ నెంచును.

క. తమతమజాతులనాతుల
రమణులు గోరుదురు మిగుల ♦ రక్తిని నన్యో
న్యముగా నగునే శుకపిక
రమణీరమణులకుఁ బొందు ♦ రాగము మిగులన్. ౧౬

(ప్రకాశముగా) చోళలోలనయనలపై నీకింత పక్షపాత మేమి?

చ. మొగి గుజరాతినాతిచను♦మొగ్గలు కంచుళి దాఁగి దుర్లభం
బగు నన గోఁచి లేమిఁ గటి♦నంటఁగఁ జల్కనఁ జిక్కనెంచఁగా
నగు నది మార్పు చోళసతు♦లందుఁ గనం గడ దాన నేమగుం
దగు నెకఁ డొక్కచో సులభ♦తన్మతి యన్య మటన్యమం దగున్.

కాని రేయుంబవలును మగనిప్రక్క నేమఱనిదాని నెట్లను సరించితి వని నామది తత్తఱించుచున్నది.

ఏమనుచున్నావు? ఇది యంతగొప్పది కాదు. ఎట్లన?

మ. పతి సెజ్జ న్నిదురింప నే నఖములం♦ బార్శ్వంబున న్గీఱ నీ
రితకాలంబున కేగి గూఢముగ నా♦రిం ద్రిప్పి మే నొక్కచేఁ
బతినిం గౌఁగిటఁ జేర్చి నేర్పున ననుం♦ బా గొప్ప నన్యంబునన్
స్వతఁ గ్రోడీకృతుఁ జేయు బాహులతికం♦జంచచ్చలన్నేత్రయున్.

అనియా?

ఔరా శ్రోత్రియుని తెగువ! (మరాళికం గూర్చి)

మ. ఇల సంకేత మొనర్చుఁ గాక యిలు నె♦ల్లెఁ జొచ్చెడుం గాక కాం
తల నేకాంతముగాఁగ నే మయిన నం♦తం జేయుతం గాక యూ
వలన న్పేల్కొన భర్త యెట్టిగతిఁ దాఁ♦బట్టుం గటా తద్భుజా
వలయాలగ్న వరాకి నాతి చెలియా♦ప్రాపించునో యేదశన్.

పౌరాణికా! ఏమనుచున్నావు? మేల్కొనెఁ బో వాఁ డేమి చేయఁగలఁడు?

క. ఇల గుజరాతులలోపలఁ
గలవింశాచార మిదియె♦గద ముఖ్యముగాఁ
గొలువరియొ పురోహితుఁడో
కులపౌరాణికుఁడొ యొకఁడు♦గూఢపతి యగున్. ౯౦

అందున నతిప్రసంగ మిఁకఁ జాలును సెలవుపుచ్చుకొనియె దను. అనియా?

నేనును వేశవాటి కేగెద.

(మరాళికం జూచి) సఖీ! పురోహితపుత్త్రివృత్తాంతము సత్వరముగఁ దెలిసికొనవలయును.

ఏమనుచున్నావు? అతఁ డొకఁడు నీదయిత యొక్క తె యీయిరువురవృత్తాంతము నాద్యంతముం దెలిసికొని యిప్పుడ తమయెదుట నివేదింతుం గాక యనియా?

సఖీ! సరిసరి! వెడలుము. (తిరిగిచూచి ఇది యేగదా! మదనపరవశతరళతరుణీహస్తవిస్రస్త పేటికాగలితవీటికాకలన చతురచేటిక యగు వేశవాటిక. ఔరా! మఱియు నిది రోషాకులభాషాజితరోషావృతకీరాయుతకారాయితమణిమంజుల రుచిపింజర నవపంజరమాలాశతలీలాయుతప్రతిసదనప్రతీహారయుఁ బారావతవారాధిగతవిటంకయు ధారాయంత్రసందానితకంకణయుఁ గుసుమరసపంకిలసదనాంకణయునై లంకయుం బోలె లక్ష్యమాణాక్షవిహారమై యయోధ్యచాయ రామానువృత్తభరతప్రచారమై హారమూర్తిరీతి భుజంగభూషితమై సరసివరుసఁ బద్మినీప్రచురమై వనభూమికరణి హస్తినీకరసమితపున్నాగమై కాదంబరిపగిదిం బ్రకటితహేమకూటవిస్తారమై నారాయణతనుసరణి భోగిభోగానురక్తమై విప్రసభభాతి శ్రుతిమిలితవివిధవాద్యారబ్ధకోలాహలమై యొప్పుచున్నయది. (ప్రవేశ మభినయించి యించుక మరలి) ఇక్కడగదా!

చ. మెలఁతలు మేడపైఁ దిరుగ ♦ మేనినిగిన్నిగ లాగవాఋవీ
థుల వెలిఁ బాఱఁ గొన్నిటిని ♦ దొంగిలి మబ్బులు లోన వైద్యుత

చ్ఛలమున దాఁచు నొక్కనిమిషంబు బయల్పఱుచు న్ని మేష మ
వ్వాలఁ దనచేతఁ బడ్డతగుబంగరుసొమ్మును బీదచాడ్పునన్. ౯౧

మఱియును

చ. భము లవి తమ్మిపూసిగలఁ బన్నగమ స్తములందుఁ గొండ ల
భ్రమున సుడుల్ సపద్మసితభానుల ని ర్లిల లాయనంటకం
బముల న వన్నియుం గలసి బంగరుతీవల నవ్వి ముంగిటిం
డ్ల మొదల నేఁడు చూడఁ జెరలాడెడు నచ్చెరు వేమి చెప్పఁగన్.

(అంతటం గలయం గనుంగొని) బళీ బాలాతపరమణీయత!

గీ. అఖిలలోకంబు రంజించు నౌర యిచటి
రమ్యబాలాతపప్రసరమ్ముమహిమ
సదనవాపికసారససౌరభంబు
సంపదయు నంతటను జాల సరసపఱుచు. ౯3

(ఆకసమునఁ జెవి యొగ్గి) ఏమనుచున్నావు?

ఉత్సాహ. ఇచట నాటఁ దిరుగు చెలుల దిది యధరవిభాచ్ఛటా
రుచి వెలంగ లేఁతయెండరుచులు గావు కేళికా
భ్యుచితవాపికాబ్జవనభవ్యారుసురభియుఁ గా
దిచట ఏరివదనకమలహితసుగంధలహరియే. ౯౪

అనియా?

సత్యము. ఇచ్చటిహరిణేక్షణ లట్టివారలే. ఏలయన

చ. కరవదనాంఘ్రినిం గదలుకన్నుల బొమ్మను దన్నుచన్నవ
న్గురులను గేలుతీవలను నూత్నసరోజతరంగతుంబికా
వరఫలశైవలాలిబిసవారము గాంచునిజప్రభాసరో
వరముల నీఁదులాడెదరు వారఘటీఘనరాజిత స్తనుల్. ౯౫

(కొన్నియడుగు లిడి పరికించి) ఏమిది యిచ్చటనే లీలావతి
లేయెండఁ గాఁచుకొనుచున్నది. దీనికి

చ. తోలి దోలి నల్ల నాకబరి ♦ దువ్వియు గొంతుక నంతఁ జుట్టి యు
వ్వాల నుపగూఢకుంభకుచ♦భారతఁ గాంచియు నీవి మెల్లన
న్గలసి వదల్ప నాభిపథ♦కంబు కరాగ్రముల న్స్పృశించు నీ
వలఁతిపయిం దివాకరుఁడు ♦ వారనిరక్తిని గామిపోలికన్. ౯౬

మఱియును

గీ. నిన్న యలఁదినకుంకుమ ♦ మన్నభ్రాంతి
బాల బాలాతపము దుడు♦వంగఁ గడఁగి
స్తనతటం బార్ద్రనఖరాంక♦సహిత మగుట
రుద్ది సీత్కార మొనరించుఁ ♦ దద్ద నువ్వ. ౯౭

(అనుసరించి) చెలియా! పలుదినములకు నీసీత్కారసుధా
రసము వీనుల కానందము కందళింపఁ జేయుచున్నది.

(అభిమానముతో సావహిత్థముగ) ఏమనుచున్నావు? ఎవతి
నియెదుట మునుపు గాని యిపుడు గాని సీత్కార మొనరించె
ననియా?

అట్లైన న్మఱచితి వేమి? మేము మాత్ర మెప్పుడును మఱ
వము. ఏలయన

ఉ. ద్యూతజితాధరచ్ఛదము ♦ తొయ్యలి నొక్క సరక్తి నేఁ బటం
బాతఱి జాఱ దృశ్యకటి♦వై చలనేత్రత నన్నుఁ గాంచి యా
చేత సరోషలజ్జముగ ♦ సీత్కృతితారముగా వచించునీ
మాతతజల్ప మిప్పటికి ♦ నట్టిముదం బిడు మాకు నెంతయున్.

(రోషముతో) ఏమనుచున్నావు? ఏమి యిట్లు నీభాషిత మనృతభాషిత మయ్యె! లేక,

* గీ. అనృతమయ మంగము నఖశి♦ఖాంతముగ న
నేకజన్మములను గృష్ణ ♦ నీకుఁ గాఁగ
నేఁడు సకలమ్ము తత్త్వమ్ము ♦ నాడు టెట్టు
లనృతముల నుజ్జగింపఁగా ♦ నగు న దెట్టు. ౯౯

అనియా?

(నవ్వి) ఒండుచోటను బొంకులకత లెచ్చటనుండి వచ్చును?

గీ. ముజ్జగంబుల సంకట♦ముగను బెద్ద
కాలముగఁ జేరుకొనుబొంకు ♦ లోలిఁ గలసి
యన్నియును నీదుకడుపున ♦ నున్న విచట
నడుము బెడఁ గను నెపమున ♦ మడఁగి మఱఁతి. ౧౦౦

ఏమనుచున్నావు? ఈవాక్కలహమున నేమి పని యున్నది? వచ్చిన తెరువు పట్టుము. అనియా?

అట్లైనచోఁ గాయకలహమునే చేయుము.

ఉ. ఇం పగునింటఁ గేల బిగి♦యించి ననుం బడఁద్రోసి యెక్కి తో
రంపుఁగుచాద్రితాడన మ♦రం బొగిఁ బిండిగఁ బోరి యెంత సా
ధింపఁ దలంచి తాత్మ నది ♦ తీఁకువ సల్పు మ దెంతదాఁక నా
సంపెఁగపూలదండవలె ♦ శ్రాంతవు తాంతవు కాంత యాదువో.

---

* గీ. అనృతమయ మంగము నఖశి♦ఖాంతముగ న
నేకజన్మములను గృష్ణ ♦ నీవు నింత
వాఁడవే నీవు నిజ మెట్టు ♦ లాడఁగలవు
మఱి యనృతవచనములను ♦ మాను టెట్లు. ౯౯

ఏమనుచున్నావు? ఈప్రొద్దు ప్రొద్దున లేచి యెవ్వని మొగముఁ జూచితినో యిట్లీతనితో వాదించుటకు అనియా?

(చిఱునగవుతో) ఏమే మానినీ! దాని నైన నెఱుఁగ నను కొనుచున్నావా?

ఉ. బంగరుచీరఁ జే నిఱుకఁ ♦ బట్టుచు మెల్లన లేవఁ బోవ నీ
డ్యంగ బలాత్కృతి న్నిగుల ♦ వంగఁ దనూలత నీవు సిగ్గు దోఁ
పం గడు రోస మూనుచుఁ బ్ర♦భాతమునం గృతియైన యేసిమో
ముం గని తద్దియున్నఱపుఁ ♦ బొందిత దెట్టు ల దెంత వింతయో.

ఏమనుచున్నావు? ఏల నీయంతరమును నీ వెఱుంగక మేర మీఱుచున్నావు? అనియా?

(తనలో) ఇది చులకనగఁ గోపపడుస్వభావము కలది. అన్నిట నవ్వులాటమాటలం గూడ నిజముగఁ దలఁచుకొనుచున్నది. కనుక నొండువలనికిం బొరలించెద. (ప్రకాశముగ) ఓసీప్రియురాలా! ఊరక నావిషయమున నెక్కువ కోపపడఁ బోకుము. సొమ్ములో వస్త్రమ్ములో నీకుం బ్రియమ్ము లగునవి సత్వరమ్ముగం గోరుకొమ్ము నేఁ దెచ్చి యిచ్చెద.

(దోసిలి జోడించి) ఏమనుచున్నావు? చాలుఁ జాలు నీయతి వదాన్యత.

గీ. చారుగోపీజనదుకూల♦చోర కృష్ణ
యున్నయవి నీవు దొంగిల ♦ కున్నఁ జాలు
నిన్ను నించుక యెప్పుడు ♦ నేను గోర
నిచ్చుకంటెను బున్నియ ♦ మిదియె నీకు. ౧౦౩

అనియా?

ముగుదా ! నీ వే మెఱుంగుదువు ? జారులలోఁ జోరుఁడే గద ముఖ్యుఁడు.

(నవ్వుచు) ఏమనుచున్నావు ? బావా ! నిజము దొంగవే సరి ! ఇట్లు మోచారసమోచకహాచాపీచికల నాచేతసుం దోఁచితివి ? అనియా ?

(ఆనందించి) ప్రసన్నవదన వైనచో నిఁక వినుము.

చ. విమలతరాంగి యంగముల ♦ వే బిగికౌఁగిటఁ జేర్చి నీదుమే
నమరఁగఁ బాటలాధరపు♦టామృతమాధురి నాని నీవి త
త్క్రమనిభృతంబుగాఁగఁ గర♦కంజమున న్వదలింప నాదుచి
త్తము మిగులంగ యత్నపడుఁ ♦ దా నసితోత్పలపత్త్రిలోచనా.

ఏమనుచున్నావు ? కాని గాని యిపుడు పొమ్ము మునుమాపు రమ్ము అనియా ?

అట్లైనచో వెడలుచున్నాను. (అని యొండొకదెస కరిగి చూచి) ఏమిది కాంచనలతాసంతానకు లిచ్చోటనే యున్నవారు ! (నిర్వర్ణించి) ఇట నిది

గీ. లీల జింకబోదఁ ♦ బోలుకన్నులమేలి
మోముదమ్మి నద్ద♦మునను జూచి
తిలక మిడెడు బాల ♦ నెలబాలుపోలిక
నుదుటఁ గపురమునను ♦ సుదతి యెదుట. ౧౦౫

(చేర నరిగి) సఖీ !

గీ. హరశిరోనదిదరిఁ దప ♦ మాచరించి
వదలి మలినత నీముఖ♦భావలబ్ధి

న్గోలి మేల్బొట్టునెలబాలు ♦ నొందె బాల
యందె నందనజనిశర్మ ♦ నబ్జుఁ డిపుడు. ౧౦౬

(వినయముతో) ఏమనుచున్నావు? భావగారు చిరకాలము నకు నను స్మరణసరణి నధిరోపించిరి. అనియా?

ప్రియావతంసమా! అటుకా దటుకాదు. ఇప్పటికిని

చ. కదలెడుచున్నదోయి పెను♦కంపము నోర్వనికొనుగీవయుం
బ్రిదిలిన వెంట్రుకల్ గళన♦పీనమనోజ్ఞరుతంబు త్రావు
కెంబెదవికడాని లేఁజిగురు ♦ బేలతనంబున వ్రాలుకన్ను లిం
పొదవెడునారతమ్ములను ♦ బోటిరో నే మఱవంగ నేర్తునే. ౧౦౭

ఇంకను

ఉ. ప్రాంతతమఃపరీతహిమ♦భానువు నిద్రితనీలనీరజం
బింతి కపోతనాదమధు♦రేడ్యము భూరిగళచ్ఛలోడు వు
ద్భ్రాంతరథాంగలాస్యచతు♦రంబు హిమోదయభాసురంబు నా
యంతర మెప్పు డాసపడు ♦ నాసమయంబునె చెందఁగా మఱీ.

ఏమనుచున్నావు? మురళీవల్లభుఁడ వగునీకు మావంటి వారిపైఁ దరళీభావ మెట్లగు? ఎట్లన్న నది

మ. రతిసంకేతమునందుఁ గాంతలను జే♦ర్పం దూతి క్రీడావచ
స్తతిసంగీతసమర్థ కేలిసఖి కృ♦ష్ణా యద్ది త్వచ్చుంబనా
దృతబింబాధర త్వత్కరగ్రహశుభా♦ప్తిం బల్కు నానాముఖో
ద్ధతి నీప్రేయసి యద్దియే మురళి చే♦తక్రీత సత్యంబుగాఁ.
అనియా?

(అపవారించి) వయస్యా! సంతానకా! నీవిప్పుడు సఫలతప స్సంతానుఁడ వైనట్టు. ఏల యంటివా

మ. గళమో కంకణరత్నకోటికలనాం♦కవ్యక్తముద్రాళి యా
వల త్రామ్యో దృఢలగ్నకర్కశకుచ♦ద్వంద్వానభుగ్నాంతరం
బల వ్యత్యాసవిషక్తఫాలతిలకం ♦ బా మోము నీ కొక్కపై
దలి యుత్ప్రేక్షరతిం జరించె నని మీ♦దం దెల్పు నూహించిన౯.

వయస్యా! ఏమనుచున్నావు? మ తే మనుకొన్నావు.

గీ. వివిధశిల్పకల్ప♦నవరంబు సపులక
చుంబనాభిరామ♦డంబనంబు
కలరవకలకూజ♦తలలితకంఠమై
యతివరతికుశలత ♦ యద్భుతంబు. ౧౧౧

అనియా?

(ఔత్సుక్యముతో) యువజనమనఃకమలకాసారసారసిక
యగునారసిక యేది?

ఏమనుచున్నావు? ఇయ్యదియే. అనియా?

(బహుమానముతో) ఓసఖీ!

గీ. కుసుమశరవిధేయంబు నీ♦కోమలరూపు
గుణవికాసంబును దదన♦గుణవిలాస
మితర మే దిట నానంద♦హేతు వీవె
యింద్రములు త్వదీయరతిసౌఖ్య♦హేతులు విటులు. ౧౧౨

(ప్రశ్రయముతో) ఏమనుచున్నావు? బావా! నీవారినే
నీవి ట్లనుచితముగా నాడుట యుచితమా? అనియా?

సరే? ఇది నిజమే ఇంద్రు లనం దగదు. ఏలన

శా. రంభాకేలికుతూహలం బెఱఁచుచు ◆ నర్ంభాధికప్రౌఢవై
పుంభావంబున నే నరుం దనువు దా ◆ పుణ్యుం డహల్యావిటుం
జంభారాతి సురాంగనాకుచభర ◆ స్వైరోపగూహక్రియా
రంభుం దత్సుతుఁ జేరికిం గొనఁడు గో ◆ రన్ ధన్యుఁడు న్నాన్యుఁడై.

కాంచనలతా! ఏమనుచున్నావు? బావా! కేవలము సుగ తరంగిణీడింభదభంగురతరంగసంగతవచోభంగుల నన్నుత్తుంగ పఱచెదవు గాని యనంగవిలాసనటనరంగము లగునంగమ్ములతో మాత్ర మంగుపఱుపవు అనియా?

సఖీ! అట్లుగా దట్లుగాదు మునుమాప వచ్చెద కాచుకొనుము. (అని మఱియొకయడు గిడి చూపుఁ జాఁపి) ఏమిది యెదుటనే చంద్రముఖి ముదము నుదయింపఁ జేయుచున్నది!

మ. చనుల న్జక్కవదోయి నిక్కి నెలమి న్ ◆ శత్రు న్ముఖేందు న్మగిం
పను లీలోత్థభుజామృణాళలతికా ◆ పాశంబులన్ జుట్టి దో
ష్మిని నిద్రాపగమాత్తజృంభణలస ◆ న్మీనాక్షి ముగ్ధాంగభం
గనవీనోత్సవమందు వత్ససరసీ ◆ గర్భంబున న్నాఁ దగున్. ౧౧౪

(మఱియొకదిక్కుం జూచి)

చ. గురువుగఁ బైఁటఁ జన్గవను ◆ గూరిచి మెల్లన వంచి మధ్యమున్
గరయుగకంకణోద్యతఝ ◆ ణంకృతి సంపెఁగనూనె వంచి త
చ్ఛిరమున రాచి మందహాసి ◆ చేఁ దల నంటుచు నున్న దింతి తా
పరునకు బాహుమూలముల ◆ వారక తెంపు చలాక్షిఁ జూడఁగన్.

(కొన్ని యడుగులు నడచి) ఆనందముతో నిట నిది

ఉ. జానువు లూని కేలు పయిఁ ◆ జాఁపుచుఁ జన్గవ క్రిందుమీఁదుగా
శ్రోణిభరంబు పార్ష్ణి నిడు ◆ చున్ నఖరాంకచయంబు దోఁపఁగన్

జానుగఁ గంకణోద్యతఝణంకృతితారరవ ప్రవర్తరంబుగా
మానిని కట్టుచున్న దిట మామకచిత్తము నైజకైశ్యమో.

మఱియును

గీ. ఎగిచి నామదితో భుజాయుగము నాదు
ధైర్యమునఁ గుంతలభరంబు తఱుచుగా వి
దిర్చి కుటిలాంతకేశి బంధించునాదు
చూపులను గల్పి యే మిది సొబగు మీఱ. ౧౦౭

(సమీపించి)

గీ. క్షణము నిలుపుము నాదుపక్షయుగంబు
పణఁతి కమనీయకచభారబంధనమున
గాటముగ లగ్న మైనది గాన మెల్ల
బైటి కెత్తెద నిప్పుడ పద్మనేత్ర. ౧౦౮

(అనాదరంబునం బోలె) ఏమనుచున్నావు? నిన్నవతె యిచ
టికిఁ బిలిచినది? అనియా?

(అనునయముతో) కల్యాణీ! ఏ మిది చూడకయ నన్నా
క్షేపించుచున్నావు!

మరల నే మనుచున్నావు? నిన్నుఁ జూచి యేమి భోగభాగ్య
మనుభవింపవలయును? అనియా?

ఏమే కల్యాణీ! నా కేమియు లేదా?

ఏమనుచున్నావు? లేనే లేదు.

చ. జననమునుండి ప్రత్యహము చౌర్యముతో నుదరంబు నిండె నెం
తనఁ బణదానశూన్యసురతాళుల గోపికలప్పులఁ దగఁ

జనిశతకోటులైనఁ గొన♦సాగవు తాదృశ కృష్ణ యేమి మే
మొనయుదు మింక నీకుఁ గల♦దెయ్యది యిచ్చెద వేమి మాకిటన్.

అనియా? ముగుదా! నీకుఁ దెలియదు.

చ. సిరి విడ దెప్డు రత్ననిధి ♦ చేరుగృహం బిఁక వైభనంబులం
బరఁగినభృత్యు లింద్రముఖ♦వారము మీాఱుదు రుండ నిమ్మదీ

ఏమనుచున్నావు? తక్కిన దేది? అనియా?

పరమవిభూతి షడ్గుణము ♦

ఏమనుచున్నావు? ఏచోట నున్నది? చూపు మనియా?

బైల్వాఱుపం దగు నెట్లు

మరల నేమనుచున్నావు? ఏల చూపఁగూడ దనియా?

ఛన్నుఁడన్

దరుణిరో యిప్డు సర్వమును ♦ దత్సమయంబునఁ గాంతు వీ వెకా.

(నవ్వుచు) ఏమనుచున్నావు? మఱి యేగతిత నైన నిటు వంచింతువు గాని నాయెదుట నిటు లెప్పుడునుం జెప్పకుము అనియా?

(నవ్వి) ఈదివసమున నాపలు కెల్లైనను రుచింపదు. అట్టి తఱి గలిగినమీాఁద నీవ తలఁచుకొనియెదవు. (అని మఱియొక దిశ కరిగి యానతోఁ జూచి) ఏ మిది యిచ్చట లవంగిక కనకాంగి నలంకరించుచున్నది?

గీ. బలియఁ గూడినచనుజక్క♦వకన నోంప
మోము నెల తనచుక్కల♦మూఁక దించె
ననఁగ నొప్పెడు హరిణాక్షి♦హారవల్లి
యాణిముత్తియములతోడ ♦ నందముగను. ౧౨౧

(కొంచెము సమీపమునఁ జేరి) ఇది యిప్పుడు

క. ముకు తాన తాల్చి హారము
గొన రక్తిమ నధరకాంతిఁ ♦ గొదికెడుమదితోఁ
గనుఁ బవడపుదం డని యో
చన సేయుచు మరల మరల ♦ సతి ముగ్ధతచేఁ. ౧౨౨

(సమీపమును జేరి)

క. కల్పలతాశిల్పము నా
కల్పముగాఁ గెలువఁ జెలువ ♦ గల్పింపు సదా
కల్పపరికల్పనము నా
కల్పాకల్పోపకల్ప♦కప్రసీమేనఁ. ౧౨౩

(లవంగికను జూచి) ఏ మిది కనకాంగియంగములందును సొమ్ముల నుంచెదవు ?

(సాకూతముగ) ఏమనుచున్నావు ? అందునకై యే దేవరా ! యాభరణార్పణశ్రమ. ఏమన ?

గీ. నైజసౌభాగ్యభాగ్యపూ♦ర్ణ మగు మేన
నిండె లావణ్యగరిమ యీ ♦ నెలఁత కనుచు
జనులలోచనములఁ గని ♦ శంకఁ గొనుచు
భూషణార్పణ సేయఁగాఁ ♦ బూనితి నిట. ౧౨౪

అనియా ?

ఓసీ మంచినేర్పరివే ? ఏల యన నీవు దీనికి

క. కనకలతిక దనపూవుల
ననలం గప్పుగతి భూష♦ణంబుల నీవీ

వనితాంగములను గప్పితి
జనులదురీక్షణభయమునఁ ♦ జంచలనేత్రా. ౧౨౭

(క్షణమాత్రము నిర్వర్ణించి) ఓసీ లవంగికా! నీయీపూనిక విఫలోదయ మైనయది.

ఉ. సొమ్ములు మేను గప్పఁగను ♦ జూచితి ముగ్ధవు వ్యర్థ మిద్ది యీ
కొమ్మతనుప్రభాసరసిఁ ♦ గూలి మునింగెను సొమ్ము లెల్ల హా
రమ్ములు నవ్వనం బ్రబద♦రక్తిమ లత్తుక నేత్రలీల శ్రో
త్రమ్ములకల్వ లంగరుచి♦దండసఁ కీజలతారుచీరయున్. ౧౨౮

(మరల నిర్వర్ణించి) దీనికి

గీ. కాంతకర్ణాంతనయనాంత♦కాంతిదృష్టి
శ్రవణపూరసితేతరా♦బ్జమ్ము గ్రమ్మ
నత్తుముత్తెము నెత్తెడు ♦ క్రొత్తనగవు
మొలచునెమ్మోము నామది ♦ ముద మొనర్చు. ౧౨౯

(అనురాగపులకోదయములతో యోచించి) ఓప్రియా! నేనేమి సేయుదును?

మ. సతతేందీవరకుందచంపకజపా♦జాత్యబ్జజాతస్పృహా
ద్రుతలీలాకనకాగతుంగశిఖరా♦రోహావరోహశ్రమం
దతవక్త్రాధ్వపుపాటున స్సరసి మ♦గ్నంబై తగం బ్రాంతసై
కతమోహాతరుమూలమందు మది మై♦కం బెక్కి వేగం బడెన్.

లవంగికా! ఏమనుచున్నావు? లోకమునం జనకునకుం దనయసదనానునర్తనము తగునదియ గదా! అనియా?

(తనలో) ఏమిది యిది సిగ్గు లేక యిటు చెప్పుచున్నది!

(ప్రకాశముగ) కనకాంగీ! (సిగ్గుకినుకలతో లవంగికను గ్రీడా కమలమునం గొట్టుచు) ఏ మనుచున్నావు? ఓసీ లజ్జాభయ ముల న్వదలి దుర్వాక్యముల న్వదరెద వేమి? అనియా?

లవంగికా! (ధైర్యముతో) ఏ మనుచున్నావు? మొదల వద రినయధిపతిని వదలి నామీఁదనే కినియుదు వేమి? అనియా?

(నవ్వుచు) ఓసీ నీసాని నన్నుం గూడఁ గోపించుఁ గాని దాన నిట హీన మైన దేమి?

చ. ఎదురుగ వచ్చి కోపపడ ♦ నిప్పుడ తన్ముఖగంధ మబ్బుఁ దా
నొదవును జేయిచేఁ గలని ♦ కూనఁగఁ బెంజనుగౌఁగిలింత న
న్నిదె పడఁద్రోసి క్రింద నెద ♦ నెక్కినఁ గోరిన దొంగిఁ కేమి నా
మది నది గాన వేగముగ ♦ మానిని కోపము నూనుఁ గా కిటన్.

(విన్న ట్లభినయించి) ఎక్కడిది దీపురబాలకులకలకలము? (ఎదుటం గని వెడనగవున) సఖీ! కనకాంగీ! చూడుము చూడుము. ఇతఁ డూరకూరక యే పుణ్యాహవాచనబలిశాంతి హోమము లని పేరుఁ బెట్టి విధులం గల్పించి యందున నంద అన్నిచందములఁ జందనములం బూయ నంద మాలినవదన మునఁ బసపుఁ గలిపి యతికించినపచ్చనియచ్చుబియ్యము గల నుదురునను దాసికల న్నోసగించి దానముగఁ గొన్నపంచాంగుళ పరిమితిసికుంచిత మగుప్రాఁతపంచెచేఁ గల్పించినతలపాగనుండి వ్రేలు వేనవేలయంచులచేఁ గ్రాలుమోమునను జంచలచేలాం చలదృఢసంచిత మైనను బడిపోవు ననుకొంచికచే సారెసారెకుం గుశతృణాంచిత మగుకరాంచలమునం బరామర్శించుపంచాంగ మునను గుడిప్రక్క నుంచినప్రాఁతసంచి నెలుకలుచించిన దారిం

గాఱుపెసలుం బియ్యము నాఁప వ్యగ్రతరంబు లగుకరంబులను బరిహాసపర మగుపురదారకపరివారము నడుమ నడుమ నివారింప నుపయోగించుదండదర్భముష్టులను మిగుల మునుపటి నాఁటి వైనను విడువక చింతించుటవలన నప్పటివానిసాటిగఁ దనయింటి పనులం దనంతట బైటఁ బడి యాడుమాటలను నొప్పుచు గణదత్తునిమేనమామయు నిప్పటివేశవాటీపురోహితుఁడు నగువరాహభట్టు చంద్రికయింట నుండి వచ్చుచున్నాఁడు.

(నవ్వుచు) ఏ మనుచున్నావు? ఔరా సమయమహిమ యతిచిత్రముగ నున్నది! ఈతఁ డిన్నిదినములు నిక్కడనే చేటీకుటీరములందు నొక్కరీతి రేఁబవళ్ళు గడపి నిన్న నేఁడు తల నెరసినమాత్రమున శుద్ధవైదికపద్ధతిం బ్రబుద్ధుండై యనుదినముం బ్రాతస్స్నాన మని నిత్యకర్మవిధాన మని యేమేమో తోఁచినవి కొన్ని యాచరించి యచిరకాలముననె చదువనిదె సదవనీదేవుఁడై యొదవెను. అనియా?

ఇతఁడు మాత్రము గా దీతనిసతియు

గీ. కామశాసనబలమునఁ ♦ గడచినట్టి
దానియోచనఁ బసి యేమి ♦ కాని యిపుడు
జవ్వనము జాఱినది గాన ♦ సర్వవిధుల
మీఱినపతివ్రతయె యగు ♦ మెలఁత యింక. ౧౩౦

(మఱియుం జూచి) ఏ మితఁడు మిగుల సమీపించి పంచాంగముఁ జెప్పుచున్నాఁడు! (విని నవ్వుచు)

గీ. పత్రరసమున మఱి మఱి ♦ బంతి దుడిచి
దాల్చి పంచాంగమును దర్భ ♦ దాల్చుచేతఁ

బలికి పలుమఱు నెక్కొ ♦ వగ్గ మీతఁ
డొకటి కొక్కటిఁ జదువు తా♦రకలు మొదలు. ౧౩౧

కనుకఁ బలుకుసంబంధ మైనం దెలియక కూయునీతనితో నుడుగుచుఁ జెలువా! నీ విట నిలువుము. నే సెలవు గొనియెద. (అని తిరిగి చూచి) ఏ మిది మయూరకుఁ డిచటనే యున్నవాఁడు. (సమీపించి) ప్రియసఖునకుఁ గుశలమా?

సఖుఁడా! ఏమనుచున్నావు? భగ్నభాగధేయులకుఁ గుశలమెక్కడనుండి గలుగు ననియా?

(ఉద్వేగమునఁ దనలో) ఏ మిది? ఇతఁ డేదో సంకటమును వినఁ దగనిదానిం జెప్పనున్నాఁడు. లేక పరిహాసశీలుఁ డగువీని మాట విశ్వసింపఁ దగినది గాదు. (ప్రకాశముగ) ఏ మది నీ కిప్పు డైనయకుశలము?

ఏ మనుచున్నావు?

ఉత్సాహ. కనకలతిక కంబుకంఠి ♦ కఠినకుచ కురంగలో
చన సకుటిలవాల కుంద♦చారుహాస పంకజా
నన మనోజ్ఞ చేతఁ జిక్కె ♦ నాకుఁ
అనియా?

(నవ్వుచు) నిజముగా నీ కిది యకుశలమే. అతిచిరముగ ముడివడినఘోటకబ్రహ్మచారి నైననీకుఁ గామినీరత్నము కరతలలగ్న మగుట కుశల మెట్లగును?

(రోషవిషాదములతో) ఏ మనుచున్నావు? ఏమిది యరమాటలతో నాక్షేపించి పరిదేవనావసరమునం బరిహాసించెడిని వయస్యుఁడు. అనియా?

అట్లయినఁ జెప్పుము?

ఏ మనుచున్నావు?

బోయెఁ

అనియా?

(పరిశీలించుకొని) ఐనచో? వయస్యా!

క్రూరచే

తనుఁడ మిగుల

(రోషవిషాదములతో) ఏమనుచున్నావు? వయస్యా! నీవా నన్నీమాట నన వలయును? నిజముగఁ గ్రూరచేతనుఁడనే ప్రాణ వల్లభావియోగమున సైతము జీవించి యున్నాను. అనియా?

(తనలో) ఏమిది? ఇతఁడు వేఱుగాఁ దలఁచుకొని కోపమునే పూనుచున్నవాఁడు, (ప్రకాశముగ) సఖుఁడా! నిన్నుఁ గ్రూర చేతనుఁ డని యెన్నటి కైన వచింతునా? మఱే మన్న.

కాముఁ డేటు దక్కనెటులు సేమముల్. *

అని చెప్పం దలఁచుకొని యుంటిని.

ఏ మనుచున్నావు? ఐన నేనును దీనినే

ఉత్సాహ. కనకలతిక కంబుకంఠి ♦ కఠినకుచ కుంభగలో
చన సకుటిలవాల కుంద♦చారుహాస పంకజా
నన మనోజ్ఞ చేతఁ జిక్కి ♦ నాకుఁ బోయెఁ గ్రూరచే
తనుఁడ మిగులఁ గాముఁ డేటు ♦ దక్క నెటులు సేమముల్.

అని తెలుపుట కుద్యమించితిని. అనియా?

(చమత్కారముతో) కనుకఁ గడ కిద్దఱము చెప్పఁ దగినదియు నొక్కటిగనే యేర్పడినది. ప్రశ్నప్రతివచనముల మాత్రము

ఏలయో యొకసంవిధానమై చిత్త్రిము సంపన్న మైనది కాని యిటఁ గలవిరోధ మేమి? కాని యేనాతి యాకనకచారుశరీర మఱి నీచేఁ జిక్కి పోయినది?

ఏమనుచున్నావు? సఖుఁడా! కాదంబినికోడలు సౌదామిని యనునది. అనియా?

ఎఱుంగుదును. సకలజననయనాపహారిణి గదా దాని తను రుచిధోరణి! అట్టిది నీచే నెట్లు చిక్కె? చిక్కినది మఱి యెట్లు తక్కె?

ఏమనుచున్నావు? ప్రియతమా! ఎంతో కాలముగ దానిఁ గలయుటకై యుపాయముల న్వెతకు చుండి నిన్నటిరాత్రి సరి ప్రొద్దు మీఱ నేకాకారముగ నంధకారము గ్రిక్కిఱియ దానియ గారముపరిసరమునఁ గాచుకొని యుండి వెలుపలికి వచ్చినయా సౌదామినిని సరభసంబుగఁ గరంబునం గ్రహించితిని. అనియా?

ప్రియుండా! ధీరుఁడవే! అప్పుడ దే మొనరించినది?

ఏమనుచున్నావు? ఏమియు లేదు. క్షణమాత్ర మరసి ఛీ! మూర్ఖుఁడా! విడు విడు మని నన్ను విదిలించుకొని యిల్లు చొచ్చె. నేనుం గోడికూఁతలు వినఁబడువఱకు నది మరల నరు దెంచు ననునాసతోఁ గాచుకొని యుండి వచ్చితిని. అనియా?

కాని గాని ప్రియతమా! యీచెలి యెప్పుడైన సమాధాన పడినట్లు నీతోఁ జెప్పియుండెనా?

ఏ మనుచున్నావు? క్రొత్తగా నడిగెదవే. ఏమన?

చ. పలుకులఁ గొంగుఁ బట్టఁ జను♦బంతుల నంటఁగ నొక్క నోష్ఠ మ
ట్లొలువఁగ నివి యేమి బహు♦ళోక్తుల నప్పుడు గాని యన్యజా

యలు వల దంద్రుడు గా పలుము ♦ అప్రకటంబుగ నోటిమాటఁ గా
వలె నని తాన వల్కు విను ♦ వాఁ డిల వీనుల నేఁడు దెల్పుమా.

అనియా ?

ప్రియసఖా ! నీ వెఱుఁగ వేమి ?

గీ. వలఁతి మందోదితనిషేధ ♦ వాక్య మదియె
యగును బరకామినీసుర ♦ తాభ్యనుజ్ఞ

ఏ మనుచున్నావు ? ఇంతమాత్ర మెఱుంగనా ?

బహునిషేధోక్తిమయ క్రీడ ♦ వారలయెడఁ
గనుక శాస్త్రమున నిషేధ ♦ గాధ వెడలె. ౧౩౪

కడ కావల దనుపలుకుల కైనను మును పెన్నఁడును వలను
పడి యుండ లేదు. అనియా ?

మఱి యెట్లు దానిమనసు నెఱుఁగకయే యిట్లు వెంబడింపఁ
బూనితివి ?

ఏ మనుచున్నావు ? ఉన్నది కొంచియు మనురాగబీజము.
అ దెట్లంటివా.

చ. నెపమున నింటి కేఁగఁగను ♦ నే నెదుటం గన నత్త సిగ్గుఁ గొం
తపు డటు చూపి లేచి వెలి ♦ కల్లన నేగుచుఁ గొద్ది యెద్దియో
నెపమున గొంతుఁ ద్రిప్పి యర ♦ నీటుగఁ గాంచెను దన్వి

అనియా ?

(తలయూఁచి) ఇది నమ్మఁ దగినయనురాగకారణ మగు-
చున్నది.

ఏ మనుచున్నావు ?

గాన దా
నిపయిని బ్రేమఁజూచునని ♦ స్నేహము మోహమునింతగూర్చితిన్.
అనియా?

అట్లయిన నేఁడో ఱేపో మీయిద్దఱకును మందాకినీమరాళులకుం బోలె నిరాయాసముగ సమాగమము చేకూఱును.

ఏమనుచున్నావు? వారి కిద్దఱకుఁ గూడిక యెట్లు లేర్పడినది. అనియా?

విను.

చ. తమతమయోరచూపునలి ♦ తమ్ముల భావము బైలు పొంగ వే
దమినలి నెట్టులో కలసి ♦ దైనమున న్నడిరేయి యింటఁ గూ
రిమి నొకచోట సందియము ♦ రేఁగఁ దపించుచు స్వీయచేష్టలే
తమ్ముఁ దెలుపంగ వారికటఁ ♦ దన్మదనోత్సవ మయ్యో నొయ్యనన్.

కాన నీవిరహావేగము కొంతకాలమే యోర్వఁ దగి యున్నది.

ఏమనుచున్నావు? ఎట్లు తాళుదును? అప్రతీకారముగ నున్న దీయనంగశరసంతాపము. అనియా?

ప్రియురాలిచింతయే ప్రతిక్రియ.

ఏమనుచున్నావు? సఖా! ప్రతికలనుం జింతించెగ.

క. స్మరశరవిదళిత మంగము
సరి యవ్రణముగ నదెట్లు ♦ సాగెడునో యీ
తరుణీగుణచింతన మను
గురుతరసంధానకరణి ♦ గూరక యున్నన్. ౧౩౭

అట్లయినను సంతాప మెక్కు వగుచునే యున్నది. అనియా?

వయస్యా! అనంగహతకునిచరిత్ర మత్యద్భుతము.

మ. క్రమసిస్సారము విల్లు పర్వముల నిం♦క న్నారి యమ్మేల మం
దముగాఁ బాఱునో లేదొ తేరు లతికా♦నానాగగుల్మాహతం
బమరు న్నీరవిలీన మంక మిఁక ద♦గ్ధాంగుండు సర్వాంగతా
పము నాతం డొనరించు నెట్టు లిపు డ♦బ్బారే మరుం డెంచినన్.

(ఇం కొక యడుగు నడచి యెదుటఁ జూచి) మిత్త్రమా?
చూడుము చూడుము.

(చూచి) ఏమనుచున్నావు? చూడఁదగినయతిమనోహరము
లగునాకారముల యుత్తరపారము దీనిం గనుంగొనుటవలన నే
నిపుడ గాంచితి ననియా?

మఱియు దీనివిషయమై నే నిట్లు తలంచుచున్నాను.

* మ. స్తనసన్మందరశైలశృంగములఁ గాం♦తాదివ్యలావణ్యవా
ర్ధిని రోమావళిభోగిచేఁ దరువఁగా ♦ దృగ్వీచులం దావిషం
బును బింబాధరమందు నాయమృతముం♦ బుట్టెన్ స్మరాధీనతన్
గనుకం గామికిఁ దాపజీవనములం♦ గావించు నా రెం డిలన్.

ఇంతియ కాక.

గీ. చానయూరున వెలయు భు♦జంగభోగ
గరిమ పల్లవరాగ మ♦ధరమునందు
బాహువుల విటపాశ్లేష♦భంగి మీఱు
సతియె పురుషార్థవితరణ♦చందనంబు. ౧౪౦

* మ. స్తనసన్మందరశైలశృంగములచేఁ తం గాంతలావణ్యవా
ర్ధిని రోమావళిభోగిఁ ద్రచ్చ మరుఁ డా॰దృగ్వీచులందు న్విషం
బును బింబాధరమందుఁ బుట్టె నమృతం॰బు న్గాన నాద్యంబు బా
ధను గల్పించును గామి కన్య మఱు చై॰తన్యంబు నొందించెడిన్. ౧౩౯

(అని ముఱియుం గని)

చ. ఘనకటిభార మంఘ్రులను గట్టుకు నడ్డిడ కుండ నున్నత
స్తనగరిమంబు కౌనుఁ బెలుచన్ నడఁ గొందఁగఁ జేయుఁ జేతియూఁ
త నొసఁగ రాదు నెచ్చెలియు దగ్గఱ నా కెదు రేగుదేర శో
భనగుణ లేచు చున్నయది వారక యైనను బల్కికల్కిచేన్.

మయూరకా! ఏమనుచున్నావు? ఏమిది వయస్యుసిం గని
నంతఁ జిరపరిచితసముచితప్రణయాలాగున సవినయముగ లేచు
చున్నది? అనియా?

మ తేమనుకొన్నావు? ఇది మదనమహీపతి మంత్రిమణి
కువలయరాయనికులాంగన యగుచంద్రిక.

ఏ మనుచున్నావు? ఏమహానుభావుఁ డీయనవద్యాంగిని గణి
కాసరణికి దించినది? అనియా?

భగవంతుఁ డగుభావభవుఁడే.

ఏ మనుచున్నావు? వయస్యా! తగునట్లు చెప్పితివి.

క. అసదృశఘటనాకుటిలవి
రసుఁ డౌవిధి భంగపడఁ జిరంబునకుఁ గృపా
రసశాలి కాముఁ డింతుల
కు సమానగుణాఢ్యుఁ గాంతుఁ గూర్చుఁగ నయ్యెన్. ౧౮౨

కాని గాని వయస్యా నీవు పరిగ్రహించినయతివ గణికయా?
పేర కులాంగనయా?

అనియా!

(అవమానముతో) నీకుఁ బ్రియతముఁ డగు భుజంగశేఖరుఁ డును భుజంగసాధారణరీతిని గణికాజనముం గూడ గణిం చునా? ఇది యిట్లు.

క. తనయంతఁ బల్లవులపైఁ
గొనురస మది యేడఁ బరుల♦కోమలులకు నీ
ధనికపణావధిక ప్రే
మనటన మన నేడ వార♦మానవతులకున్. ౧౪౩

చ. కుల మన దింత శీలమును♦ గోరదు పెద్దల కుల్క దింత యిం
తులకులదైనతంబు పతి♦ ద్రోయుఁ గదా గట వాని నైన నా
నలపరనారిరాగగతి♦ యన్య మ దేమని చెప్పవాఁడ నేఁ
దలఁపదు తద్విటార్థము గ♦దా తన ప్రాణము లొట్టిపెట్టులన్. ౧౪౪

ఏమనుచున్నావు? వయస్యా! గణికాజనగౌరవము పణా శచేఁ బరిభవింపఁబడెఁ గాని యట్లు గానియెడ

చ. విడుచును గోక సిగ్గడలి♦ వే నఖరక్షతు లోర్చు ముద్దు ల
వ్వేడ నెడఁగల్గు బంధరతు♦ లేర్పడుఁ బల్కులఁ గల్గుఁ బెక్కు కే
రడములు హస్తతాడనవి♦రావము లెచ్చును గాన బోగపుం
బడఁతులకేలి యేనరుని♦మానసమున్ హరియింప దేపునన్.

(ఉపసరించి) దండచేయిఁ జాఁచి

* క. నిలుపు నిలుపు ముపచారం
బులు చాలు లతాంగి స్వకుచ♦పూర్ణగురుత్వం

---

* క. రమణీ విపులకుచాభోగ, మ దెక్కడ తెగువ లేచుకడఁ కెక్కడ నం
దము కూర్చుండు మ టంతకు, నమరెడునుపచారరీతి యది చాలుఁ బ్రియా.

బుల వేడ లేచునంతటి
బల మగుసాహస మ దేడ ♦ వల దుఃసుగు మీఁకన్. ౧౪౬

(అని చేఁ బట్టి కూర్చుండఁ బెట్టి) ప్రియా ! పెద్దకాలమునకు నిరూప మనురూప మయ్యెను.

ఏ మనుచున్నావు ? ఇంతటితో నేమైనట్లు ? తామ విచారింపఁ దగు.

గీ. వల్లరులను దిరుగు♦వాంఛ మధుప మంబు
జని భుజింప దేని ♦ చేరి కితవ
కర్దమమున నుండి ♦ కడ కెట్టులో తేలఁ
బరిమళంబు లొంద ♦ ఫల మీఁ కేమి. ౧౪౭

అనియా ?

సఖీ ! త్వదేకాయ త్తచిత్తుఁడ నగున న్నన్యాసక్తునిఁగఁ దలంచుచున్నావు. వినుము రాత్రిందివమును

చ. పతిభుజపాశమండలము ♦ పాయుచు రాక యనన్యవేద్యహృ
ద్యతఁ జెవి నప్డు చెప్పినర♦హస్యము లక్షలదింద్రనీలసం
గతవలయంబుగా దిటము♦గా నొనరించినకౌఁగిలింత నా
మతిఁ బలుమాఱునుం దలఁతు ♦ మానక తామరసాయతేక్షణా.

సఖీ ! మఱియుం దక్కినదాని వక్కాణించెద. నీవే స్మరింపుము.

చ. నెపమున మాట లాడ నిశి ♦ నేఁ బతితోఁ జిర మింట నీ వఱే
నెపమున బైటి కేగి చెలి ♦ నిల్వ నటన్ మఱి నేను వచ్చి హా
సపుసుచిఁ బాయఁ జీఁకటియు ♦ సమ్మతి మోమపు డానితిం దమిన్
ఇపు డది యంతయుం దలఁతు ♦ నిప్పుడె గొన్నటులెన్ని చెప్పఁగన్.

మయూరకా! ఏ మనుచున్నావు? వయస్యా! ధన్యుఁడవు గదా నీవు! ఏల యనఁ బల్లవతల్లజుఁ లెల్లరు నిటు వల్లించుచుందురు.

చ. పతి యతినిద్ర వీడ భుజ♦బంధముఁ బ్రోల్చి తొలంగి మెల్ల నా
గతిఁ గొని వాకిలిం దెఱచి ♦ కల్గక యుండఁగ శబ్ద మొక్కఁ-చో
నతితిమిరంపుమూల గుఱు ♦ తారఁగ సైగలఁ బిల్చు చెల్వతో
నతిసుఖలీలఁ దేలు మన ♦ సారఁగ ధన్యుఁ డొకానొకం డిలన్.

అనియా?

సఖీ! (వ్రీడా వైలక్ష్యములతో) ఏ మనుచున్నావు? అందు ననే నీముం దింత చులకందనము నొందితిని. అనియా?

(తనలో) ఏ మిది కుచోద్యగర్భవచనమున న న్నంటఁ బొడుచుచున్నయది? కనుక దీనిని మఱియొకసంగతికిఁ జేర్చెద. (ప్రకాశముగ) సఖీ! కందుకక్రీడాకలితకౌతుకాక్రాంత యగు నాకాంత యెవతుక?

ఏ మనుచున్నావు? నాపినతల్లికూఁతురు మల్లిక యనునది. నాయందుఁ గృతస్నేహానుబంధయై బంధుజనము నతిసంధించి న న్ననుసరించి వర్తించుచున్నయది. అనియా?

(ఆనందముతో) ఇదియును నాయదృష్టమే. చేతినుండిజాఱినముద్దుటుంగరమునట్లు నిన్ను నే వెదకుచుండి మౌక్తికమాలికం బోలునీమల్లికతోడఁ గూడ నిన్ను దక్కఁ గొంటిని. కనుక నిప్పు డీవు కోపగించుకొనవనియెడఁ గొంచె మొక మాట నడుగుచున్నాను.

ఏ మనుచున్నావు? అడుగు మడుగు మనియా?

(అనురాగముతో)

చ. కనుబొమ లించుక ట్లదరఁ ♦ గల్గఁగఁ జెక్కిళులం గగుర్పు క్రేఁ
గను లొగిఁ దూఁగ మోవినఁ ♦ గంటి ముఖం బది యాన నేఁ గరా
రుణమణికంకణారవని♦రుద్ధముగా విడు విడు కాదు కా
దనియెడుదీనిపల్కు హృద♦యంబునఁ గోరుదు నే విదగ్ధ జెలీ.

(చిఱునగవుతో) ఏమనుచున్నావు? నీకోరిక నీవే దాని నడుగుము. అదియ నీకుఁ జెప్పును. అనియా?

కాని గాని దీని నించుక మాట లాడించెద. (మల్లిక నాలోకించి) ఓసీ! మల్లికా?

క. పలుమఱు నీపదమూల
స్థలమునఁ బడుచున్న నీవు ♦ సారసనేత్రా
బలమునఁ గరలగ్నం బని
యిలఁ బడ నడిచెదవు బంతి ♦ నిది యేమె చెలీ. ౧౫౨

ఏమనుచున్నావు?

గీ. పాదమూలమునను ♦ బడినను వెంటన
మొగిరి యాడుచుండ ♦ నేఁపు మీఱి
కందుకమును మఱియుఁ ♦ గాపురుషునిఁ గస
నణఁప దేది చేతి♦యందుఁ జిక్క. ౧౫౩

అనియా?

అంతమాత్రమునం దక్కువపడిన దేమి?

క. తరుణీపదపల్లవాహతి
పరమాదృష్ట మని చెప్ప♦వరతరుణులకుం

బరిపాటలతత్కరహతి
పరిభవ మది యెట్లు లగును ♦ బరమోరుమతీ. ౧౫౪

మయూరకా! ఏమనుచున్నావు? ఏమిది యిది నూతన గణిక యైనను గుల్రక్రమాగతగణిక యన లజ్జాకణిక నైనం గాంచ కున్నయది. అనియా?

మంజులాంగీ! నీ వేమనుచున్నావు? భావ! కుంజరము నెక్కి కుటిలద్వారమార్గమున నేల యేగ వలయును? అనియా?

(బహుమానముతో) సెబాసు మల్లికా! సెబాసు!

వయస్యా! నీ వేమనుచున్నావు? ఇట్లు గదా పల్క వల యును! వరాహము నెక్కి పురీషము నేల నిషేధింప వలయు నని. అనియా!

మల్లికా! నీ వేమనుచున్నావు? ఏమిరా! మయూరకా! ఉలువకట్టుకై వచ్చిననీకు నశ్వశాలాధికార మేల రా! పో పొమ్ము నీ వే మిచ్చువాఁడవా? లేక పుచ్చుకొనువాఁడవా? అనియా?

సఖుఁడా! ఏమనుచున్నావు? ఏమిది యిది గణికాజనని యట్లు కఠినతరముగఁ దిట్టులాడఁ దొడఁగెను! అనియా?

(అపవారించి) ప్రియుండా! నిలు నిలు. కుటిలాయతలోచ నలు కుటిలాంతరంగలు గదా!

ఏమనుచున్నావు? ఔను. కుటిలాంతరంగ లనఁ గూడదు. కుటిలతమాంతరంగ లన వలయు. ఇంతియ కాదు.

చ. కుటిలకఠోరతీక్ష్ణతలు ♦ కోమలియంగములం దణంగ వే
యుట నిఁక నంతరంగమున ♦ నేమని పల్కుదు మాద్య మొప్ప మి

క్కటమలకాళి రెండవది ♦ గల్గుఁ బయోధరకుంభసీమయం.
దటులనె చూపులందుఁ దన♦ రారెడు నన్యమునుం గ్రమంబుగాఁ.

కాని. చంద్రికం గని సహింపవలయును. అనియా ?

చంద్రికా! ఏమనుచున్నావు? మయూరకా! ముందు నీయం డించుక యవినయ ముదయించెను. వెనుక నీయౌవనమద దుర్లలితయు నించుక మించఁ బెంచెను. ఇంతమాత్రమున నేమి? ఆలోకింపు మాపల్లవపాశికందుకలీలం గలమేలిమి. (మల్లికం గూర్చి) ఓసీ మల్లికా! మిన్నక కలహాముం బన్నకుము పరిహాసకౌతుకుఁడగునీమయూరకునివిషయమున. మఱియుం గొంచోకసేవ చెంపు నాడుము. అనియా ?

(సంతోషముతోఁ దనలో) మేలే చంద్రిక మల్లికామయూరకుల నిరువుర సరిపఱచెను. (ప్రకాశముగ) సఖుఁడా! వీక్షింపుము వీక్షింపుము.

క. ఘనగుణసువృత్త మున కం
గన తాడన సలుపఁ జెండుఁ ♦ గని నర్తించుఁ
వనితాకుచభార మహా

ఏమనుచున్నావు ?

విను దయ యెక్కడిది కఠిన♦వృత్తుల కెందుఁ. ౧౫౬

అనియా ?

వయస్యా! ఈవైపునకు నీచూపు న్సరలింపుము. శుకభాషిణి శుకమును భాషింపఁ జేయుచున్నది. (అని చూచి సంతోషముతో)

క. చిలుకను బలికించెదునా
కలికిముఖాక్షరచయంబు ♦ కనఁబడు మూర్తి
న్నెలఁతకపోలమ్ముల విం
తలకమ్మలము త్తెము లను ♦ దంభముతోడన్. ౧౫౭

(విన్న ట్లభినయించి) ఈపురజనులకలకల మేమై యుండును.

ఏ మనుచున్నావు? వయస్యా! వెడలి తెలిసికొందమనియా?

సఖీ! సావధానముగా నుండుము. (కొన్ని యడుగులు నడచి యెదుటఁజూచి)

సఖా! అవలోకింపు మవలోకింపుము. ఇట నిది

చ. జనులఁ గలంచు వే గని బ ♦ జారున నట్టిటు దూఁకు నాపణీ
యనరులు భీతిలం దెలిచి ♦ యాస్యము నార్చ్చ యనల్పెసల్ మొగం
బునఁగయిదోయినెక్కటనె ♦ బొక్కనుమాటికిఁ బాఱు లేచుఁదా
రు నెగురుఁగ్రోఁతిఁ మెక్కనగ ♦ రుందగువ్యగ్రతఁబౌరులుండఁగాన్.

(నవ్వుచు) ఏ మనుచున్నావు? ప్లవంగచేష్టాలక్షణము లను క్షణవిలక్షణములు గదా! చూడుము.

శా. లీలం జుట్టు విటంకశృంగతతి నో ♦ లిన్ లోలసంచారియై
పేలనోర్నె రనె గ్రుక్కుఁ గోఁకు నొడలి ♦ న్వే యూఁచు శాఖాతతిన్
స్త్రీ లాస్యంబులు వంప సిగ్గుపనులం ♦ జేయుం బ్లవంగం బొగిన్
గ్రాలుం బౌరపురస్స్థలిం బ్రహసన ♦ ప్రస్తావనావ్యాపృతిన్. ౧౫౮

అనియా?

(విన్న ట్లభినయించి) ఇది యిప్పుడు

శా. నాడీభేదవిభిన్నకాలకలనాం♦తజ్జ్ఞానసంసిద్ధికై
కాలజ్ఞాభిహితాత్యమందఘటికా♦ఘంటామణిం బుట్టి లో
కాలోకశ్రవణోత్సవారచన రో♦దోంతఃక్రమవ్యాప్తి దీ
ర్ఘాలాపస్వన మాకదంబముకుళ♦న్యాయంబున స్వర్ధిలెన్. ౧౬౦

అందున నిది మధ్యాహ్నసమయమై యున్నది. పైవంకఁ జూచి) సఖా! చూడుము.

గీ. గహనలీనాంధతమసంబు ♦ గడఁగి వెదకఁ
బర్వతోదగ్రశిఖరాళిఁ ♦ బాద మూని
సాంద్రరుచి వేయికరములఁ ♦ జాఁటి తరణి
యెక్కె గగనాగ్ర మిప్పు డని ♦ యెంతు మేము. ౧౬౧

ఏమనుచున్నావు? నా కేమో యిట్లు తోఁచుచున్నది.

గీ. నెమకఁ గాంతారలీనసం♦తమసము రవి
యభ్రపాదపశిఖ నెక్కె ♦ యతఁడు మరలఁ
బతనభీతిని దనకర♦ప్రతతిఁ జాఁపి
పట్టె దిక్శాఖ లెల్లెడఁ ♦ బఱచి యొకట. ౧౬౨
అనియా?

(కడ లన్నియుం గలయం గనుంగొని) బళిరా! స్థావరములకును ఇంతటిశరణాగతపరిత్రాణపరాయణతయా! చూడుము (వ్రేలితో సూర్యమండలము నిర్దేశించి)

చ. కరములఁ జాఁపి రోషమునఁ ♦ గంజసఖుండు నిజాతపాళిభీ
చరదవనోద్యతం బనుచుఁ ♦ జాయను నాశము సేయఁ బూనె నీ
తరులు దళోరుహస్తములఁ ♦ దద్రవిరశ్ములఁ బాపి ప్రోచెడుం

ఏ మనుచున్నావు ?

బరపరిపాలనోద్యతునిఁ ♦ బాలన సేయఁ డ దెవ్వఁ డుర్విలోన్.

కాని కడకు ఛాయాపరిపాలనము పాదపమున కంత ప్రశంసాపద మైనది కాదు.

* చ. ఫలకుసుమాది స్వీయమునఁ ♦ బాంథుల హేతువు లేక తన్పి యే
వలనున నుండి యెచ్చటికొ ♦ వారక యేగుచునుండువారలన్
అల స్వశరీరసంజనిత♦మై తనరూపమునే ధరించునీ
డల నెటు లెండనుండి యక♦టా తరువుల్ గని ప్రోవ కుండునో.

అనియా ?

(మఱియొక్కదిక్కుం గనుంగొని)

గీ. విడిచి యప్పుడ యించుక ♦ వేఁడి యైన
జలజగర్భమరందము ♦ సంతసమున
కరికలభమదశిశిరక♦కరటపాళిఁ
జేరె మధుపాళి క్రొత్త రు♦చించు మొదల. ౧౬౫

(కొన్నియడుగు లరిగి) ఇది యిట

క. కరజార్ద్రవ్రణసక్తవి
హరణస్వేదజలసిక్త ♦ మగుకంచుళి సుం
దరి సీత్కృతిసంకుచితా
ధరముగ మెల్లన విడిచె ను♦దంచితరీతిన్. ౧౬౬

* గీ. ఎచట నుండియొ యెచటికో ♦ యేగునరులఁ
గాచి నిరుపాధి స్వఫలాట♦కముల మిగులఁ
దరువు లెటు గావ కుండు నా♦తపమువలనఁ
జాయ స్వాకారధారిణి ♦ స్వతనుజాత. ౧౬౭

ఏమనుచున్నావు? అది యిట్టుల

చ. బలుభుజవల్లు లెత్తుటను ♦ బ్రక్కల నిక్కెడునార్ద్రిశుష్కమం
డలనఖరాంక మహాకుచత♦టంబును జూపుచు నోష్ఠబింబ పా
టలసిచయంబుఁదాల్చియొక♦టంజుబుకాంచలయుక్తిదుస్సహో
జ్జ్వల మగునెండ వాడి నఁట♦భామిని మెల్లన విచ్చెఁ గంచుళిన్.

అనియా?

(మరలఁ జూచి) ఏమిది మన కెదుట నుత్తుంగకనకదండ మండితపాండురచ్ఛత్త్రిపుండరీకచ్ఛాయాపనీతఘనాతపయై సఖీమణీకేలుఁదమ్మి యూఁత గొని యెవ్వతెయో సలీలముగ సరోజముఖి యభిముఖి యగుచున్నయది.

(పరిశీలించి)

చ. కరముల మోహనాక్షిముఖ♦గంధము నెల్ల హరించి చేర్చె నా
సరసిజ మెంతో చుట్ట మని ♦ సారసవల్లభుఁ డంచుఁ జంద్రుఁ డం
తరముగ నిల్చె ఛత్త్రి మను♦దంభముతోడ సరోషచిత్తుఁడై
పరునిదురీక్షువైభవము ♦ వారక చూచు నెవండు ధాత్రిలోన్.

(ప్రత్యభిజ్ఞతో) ఏమిది యస్మదపహృతకౌమార యగుతార యింత త్వరలోన సమగ్రయౌవనావతార యయ్యె. ఏల యన

చ. ధృతి నుదయించి పక్వబద♦రీత్వముఁ బొన్న లరీతిఁ బూగప
ద్ధతిఁ గొని బిల్వసంపదను ♦ దాల్చియుఁ దాళఫలోపమానమై
యతివకుచద్వయం బిపు డి ♦ టంచితకాంచనకుంభజృంభణం
బతిలలితంబుగాఁ గొనియె ♦ నౌర క్రమంబుగ వృద్ధి నొందుచున్.

(కౌఁగిలించుకొని తనలో)

చ. బలిమిఁ గొనంగ నొక్కకయిఁ ♦ బట్టిన లోఁగొనఁ జిక్కు నాతిమే
న్దోలి గొనుకౌఁగిలింత నది ♦ తోఁప మదేకరసత్వ మిప్డు ప్రే
మల నిమిడింప బాహుయుగ♦మండలమందును బోల కున్న దీ
వలను మహోన్నతోరుకుచ♦భారముతోడ నెలంత యింతలోఁ.

(ప్రకాశముగా) సఖీ! భుజంగశేఖరు నెప్పు డైనం దలఁచుకొనియెదవా?

(ఉపాలంభముతో) ఏమనుచున్నావు? కితవాచారుఁడ వగు ని న్నేల తలఁచుకొన వలయును?

ఉ. మాయలమారినిం గితవ♦మానసు నిర్దయు బొంకులాని నీ
బాయనికృత్రిమాచరణ♦పండితుఁ గృష్ణుని నేమి చేయ నా
బాయక మెప్డు లోన వెలిఁ ♦ బ్రాపగుఁ గృష్ణుఁ డొకండు వాని నే
వేయిగఁ గౌఁగిలింతుఁ గని ♦ వేడుక నందెద మాట లాడెదన్.

అనియా?

(హర్షముతోఁ దనలో) ఏమిది వారనారీపరంపరలోనను హృదయము ప్రేమబంధురమా! (ప్రకాశముగ) సఖీ! నీహృదయము సహజానురాగరమణీయ మని నే నెఱుఁగుదుఁ గాని యీ నీప్రక్క నున్న నాతుక యెవతుక? దీనికి

చ. పలుకులఁ గొంచెకొంచెముగ ♦ వక్రత లెచ్చె విలాసరీతిఁ జూ
పులు సరసత్రపానిభృత♦ములుగ రహించెను మందమంద మీ
వల వలయాకృతిం గలిగెఁ ♦ బొదు లురమ్మున నల్ప మల్ప మీ
వలఁతిశరీరమందు నిలు♦వం గను మారుఁడు మాటిమాటికిన్.

మఱి యేమన

క. అనురాగ మధురమునఁ బద
మునిచి యిపుడు ముదితహృదయ ♦ మొందెను గుసుల
గ్గొన విడిచి వంకరలు లో
చనలోలవిశాలవీచి♦సంతతిఁ బడియెఁ. ౧౭౩

ఏ మనుచున్నావు? బావా! ఇది నాచెల్లెలు శశిరేఖ అని యా?

(సప్రత్యభిజ్ఞాశ్చర్యముగ) ఏమిది యింతమాత్రముకాలము ననే యిట్టి యాకారసంపద నందినదా! నే దీనిం జూచు నప్పటికి

గీ. అక్కరము లేర్పడక విన ♦ నగురసాయ
నములు పలుకులు తొడఁబడి♦నఁ గన వేడ్కఁ
గొలుపునడకయుఁ గలదీని♦కౌమరుతనము
నాఁటి దదె నేఁడుఁ దోఁచెడు ♦ నాకు నెదుట. ౧౭౪

కనుక దీని కౌమారమును నేన యుపహరించెద.

మయూరకా! ఏ మనుచున్నావు? ముగుద లగుమగువల వలపించుకలలయందు నీవు చతురుఁడవు గదా! అనియా?

ఈతార ప్రేమవిస్తారమై యంగీకరించు నేని నానిపుణత సఫలతం గను.

చెలీ! ఏ మనుచున్నావు? నే ననుభవించినమిగత గదా ఇది యనుభవింపవలయు! పో పో. కడుం గడు మాఁడుచున్న వేఁడిమిని గాలిగోళ్ళం గమలించునీదారిలో నక్కలి మాలిన టక్కులతోఁ బని యే మున్నది? అనియా?

అట్లయిన వెడలెద. మేము నుద్యానవాటిం జేరి యీయెండఁ గడిపెదము.

స్నేహితుఁడా! పురోద్యానపద్యం గనుపట్టుము.

ఏ మనుచున్నావు? ఇటులిటు లనియా?

(తిరిగి చూచి సంతోషముతో) ఏమిది భూసుర లీకాసార మునసే మాధ్యాహ్నికస్నానముల నాచరించుచున్నారు?

(నవ్వి) ఏ మనుచున్నావు? ఎప్పుడును జడాశయముపరిచయ ముం బడసినదాననే యీశ్రోత్రియజడులకు మతిజాడ్యము నిజ ముగ దినదినమున కతిశయించుచున్నది. మఱియు గంగాయము నాదిమహాతీర్థరాశికన్న నీమరకతనామకసరోవరము మహత్తర మైన దనియుఁ బారలౌకికసుఖసాధన మనియుఁ గలపురాణ గాథల ననుసరించుచు నడచుపుడమివేలుపులకు నీటిమునుక లను నేమము విడువ శక్యము గాదు. అనియా?

ఓయీ! గుట్టెఱింగినవారి కిప్పట్టుననే సుఖము కన్పట్టు నది యెట్టు లన.

గీ. పినవగవుచూపు లను నేప♦మునను గంగ
యమున గూడినయిటఁ జాన♦గముల కెదుట
మునిఁగి కొందఱు ధన్యులు ♦ ముఖ్యసౌఖ్య
ములను మఱి వలసినవారు ♦ పొందు చుంద్రు. ౧౭౫

మఱియు నొక్కవిశేషము.

గీ. కమలభృంగోత్పలమృణాళ♦కంబుకోక
సైకతావర్తశైవాల♦జాలవీచి

కమఠకరిహస్తవిస్ఫురి♦తముల వెలయు
సరసి రసికులు గ్రీడింత్రు ♦ సంతతంబు. ౧౭౬

ఏమనుచున్నావు? సఖుఁడా! చూపు నిట మఱుఁపుము.

గీ. చిత్తమోహకరణ♦సిద్ధమూలిక లగు
బాలిక లిట సరసిఁ ♦ బాసి రిప్పు
డంబుసిక్తనిర్మ♦లాంబరాంతరబింబ
మానజఘనభూరి♦మండల లయి. ౧౭౭

అనియా?

(చూచి తలఁపునకుఁ దెచ్చుకొన్న ట్లభినయించి) వయస్యా!

చ. అమలజలంబులం దడిసి ♦ యంటినవల్వల బింబితాకృతిం
బ్రమదలయంగకాళి నిటఁ♦ బల్మఱుఁ జూచెడునాకుఁ జిత్తమం
దమరును వ్యక్తతం దలఁప ♦ నయ్యవి చాలఁగ గోపికాళి వ
స్త్రములను దోఁచి నేను బొద♦ దాఁగఁగ మెల్లన ముద్రించుటల్.

మరల నేమనుచున్నావు? ఇట వెడఁదతామరాకునీడ విరి దమ్ములగుమ్ముల యిమ్ము లగుగీములు గాఁ గలరాయంచలు విహరించుచున్నయవి యనియా?

(పరిశీలించి)

ఉ. ఆయతనాళపత్త్రికప♦టాతపవారణజాతశీతల
చ్ఛాయమునై స్వపక్షువిల♦సద్భువనం బొనరించి కోశమో
దాయుతముం గలో‌త్తికవి♦సాదర మియ్యది రాజహంస పీ
ఠాయితపద్మమై కనె సి♦టుం దనపేరును బోలుసంపదన్. ౧౭౯

(ఇంకొ క్కడు గిడి) ఇట నిది యొక్కచో సముల్లసితశా
ఖాంగంబుభంగి వికచదశోకశాఖల నొప్పారి యొండుచో సము

న్నతమాతంగంబుచాడ్పున నిబిడతరతమాలతరువుల నలరి యొం డుకడ నుదారతురంగంబులరంగునఁ గ్రీడాకురంగములు మెలంగఁ జెలంగి యొక్కప్రక్క వాచాలవందిబృందంబుచందంబునఁ గల కలాయమానకోకిలకులంబులు గలదియై మఱియొక్కదిక్కున నెత్తినపతాకలవీఁక రాజరంభల విజృంభించి యింకొకచెంత నుద్భ్రాంతకుంతములభాతిఁ గేతకీప్రసూనశోభమానంబై యొండు పట్టుల నుద్యతకరవాలములలీలఁ జూతప్రవాలములం గ్రాలి యొక్కయెడ నాతపత్రంబు లెత్తినగతి శతపత్త్రిపత్త్రములఁ జిత్రితమై యన్యప్రదేశముల నుద్ధూతచామరంబులు విడంబించు చపలకలహంసంబులచే భాసురంబై కొండొకయిక్కల నుపనత సంగీతరీతిని మధుపఝుంకారసంకులంబై యొండుదెస నుదంచిత నటనచటులవారనితంబినీనికురుంబంబుడంబున మలయానిలచలి తలలితవ్రతతుల నిరతిశయంబై యొక్కవైపున నుపరచితవితా నంబులవితంబునఁ గాయమానమానితంబై యొకవంకఁ జిత్రపట మాడపములజంటఁ గుసుమితలతావిసరంబై యంతటం గుసుమ శరశిబిరంబుఫక్కి సమస్తవస్తువుల విస్తరిల్లి యవిరళదళకరనివా రితరవికరప్రవేశంబును రవికరప్రకాశచకితగురుతిమిరశరణీకరణీ యలతాగృహప్రదేశంబు నగుచు హృద్యం బగుపురోద్యానంబు పురోభాగమునం బ్రకాశించుచున్నయది. మఱియును

క. మధురాప్సరోవిలాసత
మధురసకలనాకులాలి ♦ మణిసహకారా
త్యధికతరూపశ్లాఘ్యత
బుధ వనితాజనతభాతిఁ ♦ బురవని యొనరెన్. ౧౮౦

మఱియును

క. అళికులసదగరుతిలకయుఁ
జలదళకాంతయు సువర్ణ♦చయకృతమాలా
కలిత వయోరమణీయయుఁ
దలఁప న్వనరేఖ వెలయుఁ♦ దరుణీకరణిగన్. ౧౮౧

ఇంతియు కాక.

గీ. విపులభూజఘనము చారు♦పృథులకుచము
నిరతపున్నాగదృక్స్పృహ♦ణీయతమము
మృదులవలిలలితసుమధ్య ♦ మిది యువిదల
యౌవనము వనము రహించె ♦ నమితరసము. ౧౮౨

(వనప్రవేశము నభినయించి) చెలికాఁడా! చూడుము చూడుము.

గీ. మందమందముగాఁ జేరి ♦ మారుతుండు
మంజరీకుచడింభసం♦పదను దాఁకఁ
గప్పుఁ బల్లవపాణి రా♦గవతి యగుచు
సమ్మతి రసాలవల్లరి ♦ సరసరీతి. ౧౮౩

(మరల న్విలోకించి) ఎవఁడు వీఁడు నిజనివాసముం గనుంగొన లేనివానిం బోలె దయ్యము పట్టినవానియట్లు కలఁతఁ జెంది నచైతన్యము గలవానిలాగున నింద్రియములు తందర నొందినవానిచందమున నేమము మాలి యిటులటులు వివశుఁడై యెట్టో తన్నుఁ దా బలిమికలిమి నడిపించుకొనుచు నొక్కచోట నైన విశ్రమింప కున్నవాఁడు.

(తేఁటిచూచి) మయూరకా! ఏమనుచున్నావు? వయస్యా! కలహంసకుఁడు మదనవిహ్వలుఁడై పరిభ్రమించెడిని. అనియా?

(ఉపసరించి) ఏమి ప్రియతమా! ఊరక యిట్లు తిరిగెదవు? ఏమనుచున్నావు? నే నేమి చేయుదును?

చ. ఇటఁ బిలు పిందు ముద్దుఁ గొను♦ టిచ్చటఁ గౌఁగిలి యీడ సంతసం
బిటవిడు పిందుఁ గాన్పు మఱి♦ యిక్కడఁబల్కుట యింతితోడ నం
చిటు పొదవాఁడుపూఁబఱపు♦టిక్కల బావులఁ గేళివాలుకా
తటుల ముదంబుతోఁ బ్రతిప♦దంబు భ్రమింతుఁదపింతు నెంతయున్.

అనియా?

ఏవెలయాలిచే మోసగిలినచేతసు గలవాఁడవై యింత వంతఁ గుందెదవు?

(ఏమనుచున్నావు) ఆ!!! వెలయాలిచే నంటి వేమి? నీకు వయస్యుఁడ నగునేను గణికాజనకాముకుఁడ నె ట్లగుదును? మ ఱేమనఁ బ్రభాకరకళత్ర మగుపద్మినియనిర్వచనీయవిలాస ముల విభ్రాంతస్వాంతుఁడ నగుట నాలో నే లేకున్నవాఁడ ననియా?

సఖా! బాగు బాగు!

క. ధర గణికలు తృణకణికలు
పరమున నుపరిప్లవస్వ♦భావము గనుటన్
సరసులసరసాంతరముల
స్వరసముతోఁ జొత్తు రెట్లు ♦ వచియింపు తగన్. ౧౮౫

మయూరకా! (శిరఃకంపముతో) ఏమనుచున్నావు? కల హంసకునకుఁ బద్మినియందు రాగానుబంధ మనునది సదృశ మైనదియే. ఇంక దానిసౌందర్యము నట్టిదే. ఏలయన.

గీ. దైవతోత్సవదినములఁ ♦ దా నొకప్పు
డావిలాసిని వీథిని ♦ బోవ నెపము
తోడ ముం దేగుచున్నను ♦ దోడ మరలి
చూడ వెనుఁబడు చుందురు ♦ కోడెకాండ్రు. ౧౮౬

అనియా ?

ప్రియా ! కలహంసా ! ఁయీయుద్యానవనమున ననాయాస
మున దానిం గలసికొంటి వేమి ?

ఏ మనుచున్నావు ? పరునికళత్ర మనాయాసమున నెట్లు
సమకూఱును ? మఱి విను.

మ. మది దృగ్విభ్రమచేష్టలం గనియు న♦మ్మం గాదు పో నమ్ముచో
నది భాషింప నశక్య మైన నది వ♦శ్యం బెట్టు లౌ నౌను బో
యది యెల్లెనఁ గ్రమాన నొక్క యెడ శ♦క్యం బె ట్లవిఘ్నంబుగాఁ
దుది దాఁకం బరకాంత దక్కు నొకొ లే♦దో నందియంబింతకుఁ.

అనియా ?

(తనలో) ఇది యిట్లే. ఈవిషయమున సౌదామినీకాముకుఁ
డగుమయూరకుఁడే యుదాహరణము. లేక భగ్నభాగధేయుఁడ
నగు నేన యుండ నితరుల వెదుకం బని యేమి ?

(ప్రకాశముగ)

చ. క్షణ మొకచోటఁ గూడికయొ ♦ స్వైరిత నిచ్చక మాడుటే దృఢా
ప్తిని బరిరంభమే హృదయ♦తృప్తియొ లేక రతాంతవిశ్రమం
బొనరుటొ యేమి మేల్మి పర♦యోషలకూడికలందుఁ గల్గు నై
నను విను నామనంబు పర♦నారులఁ జేరెడు నేమి చిత్రమో.

అందున నో వయస్యా ! పద్మిని నీ కెట్లు సమకూఱెను ?

ఏ మనుచున్నావు? సహృదయా! దానికై నేఁ బడినకష్టపాటు రాత్రిందివము నొక్కనెల చెప్పినం గడముట్టదు. విన్నమాత్రము దాననేమి ప్రయోజనమున్నది? ఫలితముఁ జెప్పెద. అది నాతొలిచూపు మొదలుకొని ప్రాచీనపుణ్యపరిపాకప్రకర్షముననో శుభగ్రహానుగ్రహమువలననో కులదేవతానుకూల్యముచేతనో మధుమాసవాసరానురోధమునుండియో దక్షిణానిలదాక్షిణ్యము నెంచియో కోకిలగురూపదేశగౌరవముఁ గాంచియో మధుమదచపలమధువ్రతవిరుతమంత్రాక్షరమహిమాతిశయముననో ప్రసవరజస్సిద్ధచూర్ణప్రభావముంబట్టియో మదనమహారాజాజ్ఞావిభూతిమహత్త్వమందియో వేయేల పరపరితాపాసహిష్ణువై స్వభావతరళమై రసికసమాజహృదయరంజనమై పరప్రార్థనాభంగభీరువై సహజసరసమైనతనప్రకృతివిశేషముచేతనే స్వజనోపరిపరిగృహీతరాగానుబంధమై బందుగుల నత్తను మామను మగనిని బరిజనమును వంచించి సమయబంధం బొనరించి యెప్పు డెప్పుడు నన్నుఁ దనంత ననుసంధింప నుద్యమించు నప్పు డప్పుడు నిష్కారణవైరియు సదృశసమాయోగవిఘటనకుటిలుఁడును బరశ్రేయోవిఘాతకారియుఁ బ్రకృతిదారుణుఁడును గరుణాగంధవిధురుఁడును వాత్సల్యకథానభిజ్ఞుఁడును దుర్విదగ్ధుండు నగువిధి కఠినమై బహువాసరము లాకమలిసి మాత్రము విఫలమనోరథ మైనది కాదు. మ తేమన నేనును శోకమలినీకృతుఁడనై తిని నిన్నటిదినమున నైననో తిన్నతిన్నగ గభస్తిమాలి యస్తగిరిమస్తకమునుండి చరమవారిధి కవతరింప నరుగుచుండఁ బైఁ దగిలిమిగిలినకిరణమంజరులం బోలెఁ బతంగపతనవేగమునఁ గదలి

పొరలుకడలినీటనుండి వెడలి మొగిరినబడబానలజ్వాలలలీల విరహిజనహృదయతార్ణగృహవితీర్ణపరిశ్లిష్ట మదనవిసృష్టదహనహేతులభాతి ననయుసంధ్యారాగరుచుల మేఘపటలము లతిపాటలము లగుచుండ నోర్వరానిదానియుష్ణవేగమువలనియసహిష్ణుతగతిఁ బక్షులు తత్క్షణతారతరవిరావముఖరముఖములై మిక్కిలిగ జెక్కలం బ్రక్కల నొక్క మొగి న్విడిర్చుచు శిశిరకుసుమరసపరాగపిహితనిజహితకులాయమహీరుహములఁ జేరఁ బాఱ దానిం గనినదిగులుమిగులునం గమల తనకమలగృహములను దళములన్ తలుపులన్ బిగియింప మఱి దానికడువడ నుడికి కలువపువ్వులను ముత్తియంపుచిప్పలు మిగులం బగిలి విరియ దానినుండి దారిదారిం దరఁగలుగ నెగిరి కవిసిననిప్పులరవలకుప్పలమాడ్కిఁ దారలు దర్శితావతారలై యేతేర దానిపొగలతెగలకాటుక గాటముగ నాకసము నంటి పేరి మిక్కుటమగుట న్నరల జాఱు కరణిఁ దిమిరవిసరంబులు దిక్కులం బిక్కటిల్ల దానినుండి మొగురుమిడుఁగుఱుల తెగలపోలిక వనాంగణముల జ్యోతిరింగణముల గణములు పొంగార మఱియుం జనులనయనములు విఫలతం గన సకలతారకలు కాంతుల నెంతయుం గొన జక్కవలమనోవేదన లెక్కువలు గా ఘూకలోకాలోకములయాయువు చేవ నొంద దూరపుటింగలంపుమంటలు గంటఁబడఁ గువలయమకరందబిందువులం ద్రావి తుమ్మెదలు నెమ్మిఁ గ్రమ్మఁ జకోరకములదప్పి యుప్పరంబు ముట్ట నశేషౌషధములనిగ్గులు నెగ్గ దీపప్రభ లేపుఁ జూప నించువిల్కాఁడుమించ సంజకెంజాయ గుంజుకొన శీతలానిలములం గొలఁకులవలనిశంక లంకురింపఁ గ్రొన్నెల చూపులకు వెలుపల నిలువఁ దొలివెన్నెల మొలుపు గొలుపక యున్నయక్కాలమ్మునం గటకెచీఁకటకూటువ యనుపటంబున న్మసుం గిడి

యొక్కం డైన నను గనుంగొనకుండఁ దిన్నతిన్నగా నడుగు లిడుచుం గ్రమంబునం బ్రభాకరగృహప్రాంగణముం బ్రవేశించి యందు ముం దేర్పఱచుకొన్న సంకేతస్థాన మగుస్నానాలయమం దుంటిని. అనియా?

అట్లైనచో నీవును సంప్రదాయ మెఱింగినవాఁడవే.

గీ. జనులు గనకుండ దాఁగంగ ♦ స్నానగృహము
పూలగుడిసెయొ మఱి గోష్ఠ♦మో విశాల
నిష్కుటమొ పరకామినీ♦నిరతభోగ
పరులు వసియించుతావులు ♦ ధరణిలోన. ౧౮౯

ఆవల నావల.

ఏ మనుచున్నావు? అంతటం దానిబావ పొగచుట్ట చేఁ బట్టి యింగలమునకా నీటియింటినే చొచ్చి ప్రొయ్యివాకిటిసమీప భువిం గూర్చుండి తల మించ వంచి యచ్చటనే యున్నయొకా నొకకొఱవిం గాలి మిగిలినకట్టెలం గొంచెము రగిలించి పైఁ గప్పు బూదిదుమ్మును విదిలించుచు హుస్సు హుస్సు మనుముఖానిలమున నూఁది యించుక కనిపించునిప్పుకలనిగ్గుల నానిబ్బరముతోడం గూడ నింటిచీఁకటిమూఁక వెడల నడిచెను. అనియా?

అయ్యో! మించి వచ్చె మించి వచ్చెను! ఆవల నావల.

ఏ మనుచున్నావు? అప్పుడు సద్దుసుద్ది లేక యుండ నాప్రక్కనే యున్నమంటినీటికడవ నేఁ బడ వైవఁగానే యానీటికాలునముసుక నప్పుడ ఫూత్కారముతో లేచినయరవేఁడిబూడిద యొక్కపెట్ట నిక్కి కనుముక్కునోటిబొక్కలం బడి నెక్కటివింతవికారముం గలిగించె. అంత నాసమయమునఁ గడవ పడినదిగులునం బరువె

త్రునింటిపిల్లినిం గడవ పడుటకుఁ గారణముగాఁ దలంచి మిట్టిపడి తిట్టుచుఁ గాలఁగా మిగిలినకట్టెచేఁ గొట్టి జెప్పలచిప్పల ముక్కు-బొక్కలను మీసమ్ములఁ జెఱఁగునఁ దుడిచికొనుచు నగ్నియాఱుట నాసం శాసి తొలంగి చనియె. అనియా ?

(సంతోషముతో) అదృష్టవశమున న్మరల బ్రదికితివి. ఆవల నావల.

ఏమనుచున్నావు ? తొలంగి చని యైదా అడుగు లిడి మరల మరలి దాపలికేల నవ్యాకలి నీడ్చి వెలుపల నినుపచీలం దగిలించి చనియెను. అనియా ?

(విషాదముతో) కష్టము కష్టము ! ఆవల.

ఏమనుచున్నావు ? అంతఁ గొంతకాల మెట్టకేల కందుండి మెల్లమెల్లనఁ గవాటపుటవిఘటన కనేకప్రకారముల నాత్మ నాయాసపఱచి సందు లేక బంధించినదగుట నెన్నియుపాయములం బన్నియు వెలువడ నలవిగాదని తెలిసికొని యిట్లు చింతించితి. ఈతలుపుబిగింపుం దలంప నలంతి యని తోఁపదు. ఆనాచెలి మైనకమలిని నాపై దయ దలంప దేని లేక యేదియో యొకయంతరాయ మడ్డపడుట న్సదనము న్వదలుట కైన నదనొదవ దేని యిప్పుడు గాట మైనకవాటబంధమునం గటికపుటిటికలం గట్టఁబడినగోడలం దెగఁ బగులనిమీఁదికప్పున నొప్పిన యింటినెపమున నేర్పడిన కట్టెబోనునఁ దనంత బుద్ధిపూర్వముగఁ బడిననాకు గీముసామిచేతం బఱుఁ బ్రాంత నీప్రభాతమున నవశ్యముగ నసంశయముగ సంభవింపం గలదు గదా ! ఇందునకు బదు లేమి సేయనలయు ? వెలుపలికి వెడలు నుపాయ

మెద్ది? ఎద్ది యోచన? ఎవ్వాఁడు రక్షకుఁడు? ఎవ్వనితోఁ జెప్పుకొనుదు? జనపరిహాసము నెటులు దప్పించుకొందును? పెత్తనము నెట్లు గాపాడుకొందును? చుట్టములపట్టుల నెట్టులు మెలంగుదు? అపవాదము నీఁగెడు తెరువేది? గురువుల నెట్లరయుదు? అన్నిటం జోరుఁడనియో జారుండనియో నరులు వ్యపదేశింతురు. ఏమి గొప్పఫల మనుభవించి యింతటి యీ యవమానముం బొందితిని? దేనిం దలంచుకొని దీని నంతయు సైతును? ఇంతియకాక

చ. ఘనకుచతుంగ మంగమును ♦ గౌఁగిట నించుక చేర్ప నైతిఁ దీ
యనియధరప్రవాలకము ♦ నైనను నేఁ జవిచూడ నైతి నా
వనితలసన్ముఖాంబుజము♦వాసన మూర్కొన నైతి నింతలో
ననె కట యంతరాయ మిటు ♦ లడ్డపడెం గద యేమి సేయుదుర్.

అనునిది మొదలుగాఁ గన్నులు మూసికొనియే తలంచుకొనుచు నొక్కకాలిచప్పుడు వింటిని. వినినంతన లోచనమ్ములం దెఱచి తలుపుపలకలరంధ్రములపొడవునం బ్రవేశించి చంద్రకాంతమయకుంతముల ననుకరించి యసారాంధకారములు సగ మగునట్లుగ సమయించి యపరిస్ఫుటాకారవిశేష మగుచున్న పదార్థవారము నించుక యెఱిఁగించుకొన్న శిశిరపాదుపాదములం జంద్రోదయసమయపరిణామము ననుమానించి యాశయు నాశంకయుం బెనంగొన ద్వారపిధానఫలకవివరద త్తనయనుండనై యానింపు పండువెన్నెల నిశ్శేషపరిస్ఫుటాకృతితో శిశిరకరకిరణనికరపరివేష్టితతిమిరప్రకరమునో యనం గొండొకవిరిసినబొండుమల్లియలదండల నిండినకురుల తెరల శిరమున ధరించి సదనవనవిహారిచకోరకిశోరకబలితచంద్రికము లగుకచ్ఛప్రదేశముల నచ్ఛకపోలప్రభా

పూరంబులం బూరించుచు శ్రుతిపథవిలంఘనజంఘాలవిపుల లోచనవసతిసీమావిభాగహేతు వగుసేతువురీతి నాసావంశ మల రార నింటికోనేటం బూసినలేఁదొవలగర్వంబు లెగమీటుట కుంబోలె నలుదెసలం గడగంటిచూపులం బరఁగించుచు సహా దరీమోహమిళితసౌదామినీకృతాశ్లేషరీతి జాంబూనదాంబరపరి పిహితావయవయై విమలనఖమణిప్రతిబింబవిడంబనంబున వదన కమలపరాజితుం డగుచందురుండు కృతపాదపతనుం డైనఁ బద క్రమాపదేశమ్మునం బదపదమ్మున న్వెదిలించి యవధీరపఱచుచు గురుకుచకుసుమమంజరీమంజులతనులతాపరిమళతరళపటీరపవ మానము నడుమ నడుమఁ బర్యస్తపటాంచలోల్లలనకపటంబునం బాణికమలంబునం బరిహరించుచు ఘనతరపయోధరయై వర్షా కాలముంబోలి ప్రసన్నసరసాశయయై శరదృతువుననుసరించి మనోహరసుధాధరయై చంద్రలేఖననుకరించి సమకరస్ఫురితకంక ణాభిరామయై సముద్రసంపద నేకరించి సుగ్రీవాధిరోపితహారయై తారం గేరడంబాడి కర్ణావసక్తగాంగేయాభరణయై సుయోధన సేనాసమానతం బూని సువర్ణమేఖలయై సుమేరుధరంబుఁ బురు ణించి సురతరుచిరోపగూఢస్వాంతయై సురవని యన న్మించి సమ గ్రకలావయవ యయ్యును దర్శితానంగవిభ్రమయై సేనయయ్యు నబలయై సంజాతసాత్వికోదయ యగుచు సాంద్రతమోవిగాహ నకుతూహలయై గుణానురాగిణి యాచుం బ్రదోషాగమోత్సు కయై పరలోకభీత యయ్యు నంగీకృతస్వైరభావయై యేకాంత ముగ నరుదెంచునాకాంతనే గనుంగొంటెని. అనియా?

నెచ్చెలీ! కుముదాకరము ఖరకరసంతాపతప్త మయ్యును శిశిరకరకలావలోకనసంజాతకౌతుక మయ్యెను. ఆవల నావల.

ఏమనుచున్నావు? అంతఁ దదవలోకనసుధారసాప్యాయిత సకలావయవుఁడ నగుటఁ జెప్ప నలఁతివడనిసంతస మెంతయు నంతరాంతరమ్ముం గ్రమ్ముకొనుచుండ నది యప్పుడ తలుపుకట్టు సడలింప మునుమున్న యరతెఱచినకవాటపుటమున కరము నిఱికించుకొనియుండి ముందుమేను ముందు నిగిడించి మదనసామ్రాజ్యసంపదవగిది నాపద్మినీరమణిం బాణిం గ్రహించి యామజననివేశంబునే ప్రవేశించితిని. ప్రవేశించి యది

చ. విడువిడు కొప్పుఁగొంగొడియుఁ♦ జెప్పిదియే మటనుండు ముందు పే
రుడుగు తెగుంగన స్గురుపు♦ లూరక సందియ మందుచుండ్రు ధూ
ర్తుఁడ మగఁడింటిపట్టునఁ బ♦రుండెడిఁ దిన్నగఁ బల్కు మంచుఁ దా
విడువక చీరఁ గౌఁగిటను♦ వేగొనెఁ దొందర నన్ను నన్నటన్.

అనియా?

ప్రియతమా! మాన్యత నందితివి.

చ. జడఁగొనఁ బోకుమీ అవికఁ♦ జప్పున విప్పఁగ వేశ్య నేమి పైఁ
బడు నధికార మెక్కడిది♦ బల్మిని రాజ్య మరాజకంబు గా
దుడుగుము నీవి నీయడుగు♦ లూనెద నిట్లనునన్యకాంత పైఁ
బడికడుఁగౌఁగిటందనుపు♦ వాఁడె కృతార్థుఁడుయౌవనాఢ్యుఁడున్.

ఆవల నావల.

ఏమనుచున్నావు?

మ. కొనపాదంబుల నిల్చి యెట్లొ భుజము♦ ల్గూడించి నామూఁపులన్
స్తనభారం బటు లెత్తి నాయురము మీఁ♦ద నార్చిచుచుం జాణ చుం
బనవాంఛాన్విత నాఁ గపోలతలసం♦స్పర్శైకచాపల్యయై
చినికె న్వాక్సుధ నాదుకర్ణముల వా♦సిం దా మనోజ్ఞంబుగాన్.

అదే మన. నేఁటికిఁ దలనొప్పి తెప్పిన నొప్పుమాలి మామగ వారు నన్నత్తగారిమఱుఁగునను పరుండు మని యాదేశించిరి. అటు లత్తయు మునుమున్న నన్ను శయనగృహంబున కనిచి నిదురం బ్రవేశించి యున్నది. అందున నిస్సందేహముగఁ బుష్పో ద్యానమున విహరింతము పోదము రమ్మని. అనియా?

మంచిగ నాలోచించినది యది. అత్తమఱుఁగున శయనిం చిన దని మగఁడును బతిప్రక్కన శయనించిన దని యత్తయుఁ దలఁతురు. కనుక రెంటను జంకు శంకింపఁ బని లేదు. అని.

ఆవల.

ఏమనుచున్నావు? అంతవిస్తారనారికేళతరుశాఖాదళవలయ కాయమానాంతరితచంద్రికాధోరణి యగుసరణిం దరుణి నన్ని యుద్యానముం జేర్చె. చేర్చి యది

* చ. తములము సేతఁ గేలిఁ గర♦తాడనఁ దత్పరిహాసభాషలన్
సమరసచుంబనంబులఁ గ♦చగ్రహణాదివిలాసలీలలన్
సముదితకామబోధ యయి ♦ సారసనేత్ర తనంత ముందుగా
సమరె రతిక్రియాకరణ♦మందలియిచ్చఁ గృతప్రయత్నయై.

మఱియును

ఉ. గొంతును జుట్టి ప్రౌఢకుచ♦కుంభకటీతటు లొందియూరుసం
క్రాంతి నితంబసాలమును ♦ గప్పి కడుం గడకంత మున్నె గం

సీ. సోపహాసచపేటికా•లాపకేలి
చుంబనకచగ్రహణవీటి•సుఖవిలాస
ములను మదనుఁడు రేఁగుటఁ • దనకుఁ దాన
తొలుతఁ దొరఁకొనె రతికి నా•తుకయె మిగుల. ౧౯౪

టింతకుఁ బో విమర్దసహ ♦ మెంతయుఁ గా దని వేగ వీడె నా
యింతి సువర్ణచేలమును ♦ హ్రీక్షణమాత్రము దన్ను ముంచినన్.
అనియా ?

మయూరకా ! (నవ్వుచు) ఏమనుచున్నావు ? సువర్ణచేలము
నని చెప్పి నన్ను బ్రతికించితివి. అట్టి నన్నే త్యజించె నని చెప్పెద
వని దిగులుపడితిని. అనియా ?

(నవ్వుచు) కాని గాని యావల.

ఏమనుచున్నావు ? అందుమీఁద

చ. మగసిరి నాదునేర్పుఁ గను♦మా మునుము న్నసి తీరు మీఱి యిం
పుగఁ జను లంత యున్నఁ జిర♦ముద్రతి సల్పుచు సోలి ఱొమ్ముపై
దిగఁబడి సిగ్గున న్నగవు ♦ దేరఁగఁ గన్నులసన్న న న్నెగా
దిగఁ గనునామృగాక్షి నన♦తీవియ నెట్టులు చెప్పఁగాఁ దగున్.

ఇట్లనేకవిధంబుల నాకామిని యాయామినియైనయాదయామిని
విరామినిఁగాఁ దలంచి యెప్పు డేను మఱియొకమాఱు కౌఁగి
లింప నుద్యమించితి నంతలో

చ. కడెములు స ద్దొనర్పఁ గర♦కంజములం ద్వర నీడ్చి గగ్గురుం
బడుచనుగుండలం దునిచి ♦ సైర్వరముగా మొలనూలు జాఱ బ
ల్వడుజఘనంబుఁ జేర్చి దృఢ♦బంధముగా బిగియించె వెంట నా
పడఁతుక పుణ్యరాశిని

(అనునరమాటలో) నిజముగ నే పుణ్యరాశివి. ఏలయన.

గీ. రమ్యపరిహాసవాక్పరి♦రంభకేళి
నాదరించినఁ గడు వశ ♦ మందు టరుదు

పొలఁతి తనయంతఁ గోనఁ బూనఁ ♦ బుసుమపుణ్య
గౌరవం బది వే ల్లోఁడు ♦ కారణంబె. ౧౯౮

(నిట్టూర్పు విడిచి) ఏమనుచున్నావు? అంతటిసుఖము. నా కెచ్చటినుండి వచ్చును? అనియా.

ఏది మఱి?

ఏమనుచున్నావు?

సు♦వర్ణవిచిత్రపటంబు నత్తేర్క. ౧౯౯

అనియా?

ఆవల నావల.

ఏమనుచున్నావు? అంతట

చ. తెలతెలవాఱఁ జొచ్చె నిశ ♦ తిన్నఁగఁ బెద్దలు లేవ కున్నముం
గల విడు వీడు పోవలయుఁ ♦ గా త్వర నంచుఁ బఁగాంతలగ్నునక్
నిలక విదిర్చి వైచియటు ♦ నీరజపత్త్రిసమాననేత్ర దా
వలితముఖాబ్జయై కనుచుఁ ♦ బల్కఱు న న్నఁడుగద్గునం జనెక్.

అది మొదలుకొని

చ. ఇటఁ బిలు పిందు ముద్దఁ గొను ♦ టిచ్చటఁ గౌఁగిలి యీడ సంతసం
బిట విడు పిందుఁ బాన్పు మఱి ♦ యిక్కడఁ బల్కుట నింతిత్రోడ నం
చిటు పొదవాడుపూఁబఱపు♦టిక్కల బావుల గేళివాలుకా
తటులముదంబుతోఁ బ్రతిప♦దంబు భ్రమింతుఁదపింతు నెంతయుక్.

అనియా?

మయూరకా! ఏమనుచున్నావు? రాత్రిందివము నెప్పుడు నది నీత్రోడమీఁదనే యుండవలయు నేమి? ఇప్పుడు ప్రాయిన

నేమి? రాత్రి వచ్చెను. ఇంతటిలో నేమి మునింగి పోయెను? అనియా? అదియట్లే.

గీ. అతనుతాప మణంచి ♦ యాప్రభాకరుసతిం
గమలముకుళకుచను ♦ గమలిని నిసి
యలంతికాలముననె ♦ కలహంసకుండు రమి
యింపం జేయుం జిత్ర ♦ మే మిటం జెలి. ౨౦౧

ఏ మనుచున్నావు?

అంతకాల మీాకంతుండు కుంతముల నుపశాంతపఱచిన నంత మీాంద శుభోదర్కమగునో కాదో. అనియా?

మయూరకా? ఏ మనుచున్నావు? ప్రమదవనపాలిక మరాలికం బిలిచి కలహంసకునకు శీతోపచారంబులం జేయింపు మనియా?

(స్మరణము నభినయించి తనలో) ప్రియురాలిపయనము సమాచారము నెఱింగి రా వనపాలిక స్మరాళికం ప్రేరేంచితిని. (ప్రకాశముగ) మరాళిక యిపు డెక్కడ?

కలహంసకా! ఏ మనుచున్నావు? వయస్యా! మరాలిక పేరుం బేర్కొనుటచే స్మరించి చెప్పెద. ఇంతకుం బూర్వ ముహూర్త మాపె వయస్యునినే బెద్దతడ విచ్చు టచ్చట వెదకి వెదకి కానక యొక్కచో నాడగ్గఱకు వచ్చి "ఓరికలహంసకా! ఎంత నెమకినను నీప్రియసఖుం డగుముకుందుం డగపడ లేదు కనుక నతండు పొడకట్టినతోడన దీని నాతనిచేత నుంచు" మని తనచేత నుండుపూలబుట్టిలోనుండి మెత్తి పత్త్రిద్వయము నాకడ నుంచి నేను "ఓసీ నీవ యాతనిరాకదాంక నిలిచి పొ" మ్మని పదింబదిగ

వక్కాణించినను « ఓరీ! రాజవల్లభుఁ డగుమందారుఁడు పురివెలుపలఁ గాళికాబల్యుత్సవము నేఁటిరేయి చేయును. తదర్థకుసుమానయనమునకు నన్నాదేశించెఁ గాన నొక్కనిముసం బైన విళంబంబు సేయ భయంబగుచున్నది" అంచు నరిగెను. అనియా?

(సంతోషముతోఁ దనలో)

గీ. ఇపుడు కుటిలభావ ♦ మించుక విధి మాని
నట్టు లున్న దరయ ♦ నెట్టు లనిన
నభయకృతిని గొన్ని ♦ శుభసూచకమ్ము లా
నక్షరముల వినఁగ ♦ నగుటవలన. ౨౦౨

మఱియును

గీ. భర్తృగేహమునకుఁ ♦ బంపఁడు మందారుఁ
డుత్సవదినమందు ♦ నుండఁ గోరి
యాఁడుసంతతుల న♦మధికవత్సలుఁ డౌట
మంజరిని నిజంబు మదిఁ ♦ దలంప. ౨౦౩

కనుక నచ్చోఁ గాళికాయతనోద్యానవనముననే నాకోరికం బూరింపఁ గల దాప్రియతమురా లని తలంచెద. (ప్రకాశముగ) సఖుఁడా! ఒకపద్మపత్త్రంబు నిమ్ము.

ఏమనుచున్నావు? ఇదిగోఁ గైకొమ్ము అనియా!

ఏమిది? ప్రియురాలికీల్గంటునం బరిమళించుగేదఁగిఱేకా? చక్కఁగా దాసినే పరికించి

గీ. వాడి యున్న దంగ♦వైభవ మే లొకొ
కైతకచ్ఛదంబ ♦ కరము తెలియఁ

జెలిని బాసి చింతఁ ♦ జెందిన నావంటి
రూపు గలుగు నీకు ♦ రూఢిగాను. ౨౦౪

లేక,

గీ. చెలులు స్మితముఖులై తెచ్చి ♦ చేర్ప జడను
ముగ్ధనటు లదియే నఖ♦ములను వ్రాయఁ
గైతకచ్ఛదము కడు భు♦క్త మగునీవ
సుకృతి వైతివి నేఁ గాను ♦ సుదతిచేత. ౨౦౫

సఖుఁడా! ఏమనుచున్నావు? చదువు మనియా?

(చదువుచున్నాఁడు)

శ్రీమహాభాగునకు శుభమగుఁగాక. అల్పభాగ్యురాల నగు నేఁ బతిభవనమునకు నిప్పుడు పోవుచున్నాను. (కన్నీటితో) అంతకు మీఁద నేఁ జదువఁ జాలను.

చ. కనులను నీరు గ్రమ్మి గుటిఁ ♦ గాంచఁగ నీదు వడంకు పట్టుఁ జా
ర్చెను గయినుండి యీ మొగలి♦రేకును బల్మిని మోహసంప్రసా
రణకలుషంబు బుద్ధి కన♦రా దొకయించుక శూన్య మయ్యె నా
యనుఁగులతోంగి పైనపడె ♦ నన్ను జగం బిది దేవ శంకరా.

కనుక నీవే చదువుము.

ఏమని చదువుచున్నావు?

క. హరియించును బతి నన్నని
పరమప్రియ పగలఁ బోగుల ♦ వల దీవు తగన్
హరియించుఁ గాని మే నం
తరము నినుం దగిలి యుంట ♦ నగు నెట్లు గొనన్. ౨౦౬

ఇంక నొకటి

క. చేరిచి తలఁ జేతుల శత
వారము లే విన్నవింతు ♦ వారక నిన్నే
కూరిచి నాపై నెయ్యముఁ
గారుణ్యము వీడ కోడలిఁ ♦ గాచుటలోనన్. ౨౦౮

అనియా ?

(నిట్టూర్పుతో)

క. బలు తెగువ కెక్కితివి సై
చెలి యింతకు నీవు దీనిఁ ♦ జెవి వినియును నే
సల బ్రతికియున్న వాఁడను
బలితం బగుగడుసుఁదనము ♦ వలన స్మరలన్. ౨౦౯

వయస్యులారా! ఏ మనుచున్నారు? ప్రియతమా! అన్నిట నేఁటిదినమున నాపెకుఁ బయానము నెఱవేఱదు కాని శ్వశురకులము నాకులపఱచుటకుఁ గేవలము తత్ప్రతిహతకుఁడు దుడుకుచేఁతలం జేయు నని తోఁచును. అది వాడుకయే. ఏ టన్నను.

మ. ప్రియమైత్రీదురసూయసాంత్వమునవ♦క్రీభూతి ప్రాంచత్పటీ
ష్ఠయనైరస్యము మృష్టభుక్తి వితథ♦స్వారస్యమున్ వెంటనే
పయనం బుత్సవవాసరంబుల వృథా♦వాచాలదంభంబు తో
డయి జామాతృపదాంకితుండు భువిఁ జే♦యం జెట్టిదుశ్చేష్టలన్.

అనియా ?

మొఱకులకుఁ బ్రకృతియే ప్రతీపాచరణము ప్రస్తుతమున ననునది.

ఏమనుచున్నావు? వయస్యా! ఈపత్త్రికను విను మఱి అనియా?

(సందియముతో) నెచ్చెలీ! వినుటకు భయపడుచున్నాను. (మరల ధైర్యముతో) ఇంతకన్న ఘోరతమ మేది కాఁగలదు? చదువు చదువు.

ఏమని చదువుచున్నావు? సమస్తవిలాసినీజనమస్తకమణిస్తోమనీరాజితచరణనఖరమండలుండును విటమండలాఖండలుండును యువతిజనహృదయానందకందుండును నగుముకుందునకు శుభమగుంగాత. ఓవయస్యశేఖరా! బాల్యమిత్త్రినివీతిహోత్రుని యీవచనమును సాదరముగ నాలకింపవలయును.

గీ. చెలియ వెడలె నంచుఁ ♦ జెందకు దుఃఖమ్ము
మూఁపులోన వచ్చు ♦ మరల నింటి
కయ్యమాట దబ్బ ♦ అనుశంక వల దెప్డు
జోసిపలుకు చెడదు ♦ వాసి నిచ్చు. ౨౧౧

కనుకఁ గొంతకాలమే విరహసంతాపము సహింపఁ దగియున్నది. అనియా?

(నవ్వి) మాపటి కేతేరఁ దలంచియే కాఁబోలు మహోత్సవములు గూడ విడిచి పతి దానితోఁ బ్రాతఃకాలముననే ప్రయాణ మగుట.

ఏమనుచున్నావు? వయస్యా! అట్లు కా దట్లు కాదు. దైవజ్ఞులు మృషావాదులు కారుగదా! కానం బ్రదోషసమయము నెదురు చూడనే వలయును. అనియా?

ఇది యేమని చెప్పవలెను? బ్రతికి యున్నంతవఱకు కెదురు చూడనే చూచెదను.

ఏమనుచున్నారు? దైవమకారణవైరి యగుచుండ నేమి సేయఁగలము? మనవుగ్గురయందు నతిదారుణతను గనుపఱుచుచునే యున్నవాఁడు. ఇట భగవతి యగు భవితవ్యతయే బలవతి. అనియా?

కాని యేదియైన నొకకథాప్రసంగమును జరుపుదము మిగతదివసమును గడపుటకు.

(ఒకని నొకఁడు చూచుకొని) ఏమనుచున్నారు? అప్రస్తుతములగునితరప్రస్తావములతో మన కేమి పని యున్నది? మాయిద్దఱియంతఃకరణము లద్భుతసముద్రమున మునిఁగి విన నతికుతూహలపడుచున్న యీమంజరీసమాగమసంవిధాన మానుపూర్వ్యముగం దెల్ప వలయును వయస్యుఁ డసియా?

(ఇంచుక మోము వాంచి) ఈవిఫలమనోరథములం జెప్పిన నేమి చెప్పకున్న నేమి? అయినం బ్రియస్నేహితులయాన మీఱఁదగ దని చెప్పెద.

వయస్యులేమనుచున్నారు? ఇదిగో సావధానులమై యున్నార మనియా?

సమస్తసురసుస్తకమఃశిస్తబకపాళికీరాజితచరణనఖుఁడై చరణానతచతుర్ముఖుఁడై భాగవతహృదయమందిరాభరణుఁడై శ్రీమదిందిరారమణుఁడైనభగవంతునకుఁ నిరంతరతరంగదభంగురోత్సవనటనరంగమును నిఖిలనగరోత్తమాంగమును నిశాకరపుష్కరిణీపరిష్కృతోత్సంగమును గవేరకన్యకాకృతపరిష్వంగమును

గనకగోపురోత్తుంగమును . నందనమాలికావలదనేకభృంగమును వందారుజనపాపభంగమును వైజయంతికాచుంబితగగనగంగము ను గగనగంగాజలధౌతసౌధశృంగమును శృంగాటకనటత్క్రీడా కురంగమును గురంగలోచనాపాంగతరంగితానంగమ ననంగమ దచటులవారకాంతావశీకృతభుజంగమును జంగమగాంగేయగిరి గురుశతాంగమును శతాంగకరచరణాపరిచరణాపరిణతమాతంగ మును మాతంగమదజలసిక్తరథ్యాచలజ్జవనతురంగమును దురంగ ఖురగళితమణికుట్టిమసముత్థితపరాగపరంపరాపిహితపతంగమును బతంగమణిమండపమండనాయమానశుకశారికాక్రియమాణహరి కథాప్రసంగమును సుసంగతసకలనిగమహృదయాంతరంగము నగు శ్రీరంగ మున్నది గదా !

ఏ మనుచున్నారు? ఉన్నది పదింబదిగఁ గనుఁగొనఁబడినదియు సేవింపఁబడి నదియు.

మ. వరసహ్యాద్రినిరూఢదివ్యశిఖర♦ప్రాలంబమానద్విధా
పరకావేరిప్రవాహారశ్మియుగళీ♦పర్యంతపల్యంక మీ
వర! శ్రీరంగము దాన శౌరి యొప్పుఁ ♦ న్వాతూలతూలాఢ్యత
ల్పరతిన్ శ్రీసతితోడఁ గాంచు నతిడో♦లాసౌఖ్య ముద్యన్మతిన్.

మఱియును

గీ. అంబరవిశాలనీలత♦లంబునందు
బింబితం బగురంగపు♦రంబు గాంచి
విధియె ప్రాణప్రతిష్ఠఁ గా♦వించి విధిసి
శక్రునకు రాజధానిగాఁ ♦ జలిపెఁ గాదె. ౨౧౩

మఱియును

గీ. చిరజలావాసజజిహాస♦చేతఁ బోలె
వలఁతు లనుమిష మెఱపులు ♦ వచ్చి చేర
వాని వెదకంగ వచ్చిన♦వారిదములఁ
బోలి మత్తగజంబులు ♦ వొలుచు నచట. ౨౧౪

ఇం కొక్కటి.

గీ. కయిని మల్లెపూల♦కయి విత్త మునిచిన
బురమునను విలాస♦పురుషు లచట
బుటికలందు సగవుఁ ♦ బూరించి యిత్తు రం
దాపణముల వనిత ♦ లాగడముగ. ౨౧౫

ఏ మనుచున్నారు ? ఆవల నావల ననియా ?

ఒకానొకప్పుడు కమలాహృదయకమలభృంగరా జగురంగ రాజు చైత్రోత్సవము నాలోకించుప్రసంగమునఁ దనంత సంతానక ప్రముఖు లగుప్రియసఖులతోడం గూడి యా శ్రీరంగనగరముం జేరి యచ్చట నాయామహోత్సవముల నమందకందళితానందము ననుభవించుచుఁ గొన్ని దినములం గడపితిని. ఒకప్పుడు కోకిలకులములకంఠగర్జితములఁ బథికజనులు తమనయనబాష్పధారాపూరములఁ బూరించినసరణులును మధుమదమువలనఁ జపలములగుమధుకరములం దరళము లగువకుళములనుండి గళితములగుమకరందధోరణులును గలిగి చందనాలయానిలమున నాందోళితము లగులతలఁ గుసుమపరాగమయము లగుపులినముల శబళితములై కుసుమాపచయసమాగత లగుపౌరాంగనల చరణములసంక్రమణములచే రమణీయతరము లగుమణిమంజీరముల మంజులరవముల నాకృష్టము లగుకలహంసములచే ధవళితములై

క్రీడాకురంగకిశోరములచేఁ గబళితము లగుమృదులదూర్వాంకుర ములు గలవియై వనదేవతాకరకలితబలికుసుమకోరకితశశికాంత మణివేదికల వెలసిన కావేరీతటవీధికల నెప్పుడైన నప్పటికి ముందు చూడఁబడని వగుటను నిసర్గముచే మనంబున కింపగుట నాప్రదే శములచేఁ జిత్రీకృత మగుహృదయమున నచ్చటచ్చట సంచ రించుచు జలదావతీర్ణ మగుచంచలాపుంజముంబోలెఁ బంచబాణ కరపరికలిత మగుకాంచనలతావనప్రపంచముం బోలెఁ గృతభూత లావతార మగుతారానికురుంబంబుం బోలె నొప్పుతరుణీనికురుం బంబుం గని.

ఏ మనుచున్నారు? ఆవల నావల ననియా?

తర్వాత

గీ. వదనగంధార్థవలదళి♦ప్రతతివలయ
శిఖిశిఖాచ్ఛత్రశాలి యా♦స్త్రీలవితతి
నచట మంజరి నేఁ గ్రింద ♦ నరసితి బహు
మహితనవకిసలయతతి ♦ మంజరిగతి. ౨౧౬

అదియును

మ. యమునాసైకతమద్విహారములలో ♦ నాత్మాంశుకాంతశ్చిరో
త్కమనోజ్ఞాంకితగోపికామయపురో♦ద్యచ్చిత్రముల్ దృష్టిమా
ర్గమునం గామిని దూఱి వెంట నిజస♦త్కాంతిద్రవీభూతకుం
కుమరాగంబున వేగ రాచి తుడిచెం ♦ గోపంబుతోడం బలెన్.

మయూరకా! ఏ మనుచున్నావు? ఆరూపసంపద యట్టి దా? అనియా?

కలహంసకా! ఏ మనుచున్నావు? లేనిచో వయస్యనిచిత్త మెట్లు చొచ్చు ననియా?

మఱి యేమి?

గీ. బాలహరిణనయన♦వదనం బనునెపాన
నమృత మనుపయోధి ♦ నబ్జయోని
పెనుప జాఱె నొక్క ♦ బిందువు జగతిలో
నదియె చంద్రుఁ డయ్యె ♦ నవితథముగ. ౨౧౮

గీ. కుంతములు చెలికుటిలదృ♦గంతము లగు
దంతములు నవకుందసా♦మంతము లగు
(వెచ్చ నూర్చి)
చింత నాకు దురంతము ♦
అయినను సంగ్రహముగఁ జెప్పెద.
కాంత జలద
వాంతసౌదామినీలతా♦కాంత నిజము. ౨౧౯

ఏ మనుచున్నావు? ఆవల నావల ననియా?

అంత వారు తమకోరికప్రకార మట నట లతానికుంజములఁ గుసుమాపచయముఁ జేయ నామంజరి తా నొక్కతయే మదనకుంజరివడువున నిటులటులుంజెరలాడుచు నొక్కమాకందలతామందిరద్వారవేదిక నే నుండఁగా నించుక వలితవివృత్తవదనగతియై మదనావేశతరంగితము లగుసపాంగములం బఱపె నదెట్లనిన.

గీ. వచ్చి సరిగాఁగ నాపయిఁ ♦ బడక మిగుల
నిలక స్వస్థలమున మఱి ♦ నిభృతముగను
అన్యలక్ష్యమ్ములఁ బదమ్ము ♦ లందక యటు
కేవలము దానిచూపులు ♦ త్రోవ మెదలె. ౨౨౦

మఱియును

గీ. అన్య లగువారు కుసుమము ♦ లరసి కోయ
మంజుమదకుంజరగమన ♦ ల్కుంజములను
నీక మంజరి సామివి♦లోకనముల
నామనోబ్జము నొక్కటి ♦ నాముకొనియె. ౨౨౧

వే ఱేల?

చ. అడుగులు వట్టె నూరుయుగ♦యంత్రము పిండె నసత్యమూర్తియూ
నడు మది ముంచె నాభి మఱి ♦ నా రనుతీవియ యీడ్చి మూఁడుపె
న్మడతలఁ జన్ను కొండలను ♦ మానక త్రోసె దృగంబకంబులుం
బొడిచె మృగాక్షి పెన్నెరులు ♦ పూనికఁ గట్టెను నాదునెమ్మదిన్.

మఱియును

చ. కచభరకార నుండి గొని ♦ కాంతముఖామృతవార్ధి ముంచి యో
ష్ఠచితసుచేలుఁ జేసి వరు♦సం గనుగల్వ లమర్చి కంతుఁ డా
కుచయుగసింహపీఠమునఁ ♦ గూర్చి మదాత్మను సుస్మితామృత
ప్రచయమహాభిషేకమున ♦ రక్తి నొనర్చెను జక్రవర్తి గాన్.

ఏ మనుచున్నారు? యుక్తమే కదా మదనునకు జనకసమా
రాధనానురోధము. అనియా?

వయస్యులారా! అట్లు కా దట్లు గాదు. అనంగహతకుని
చను వనియత మైనది. ఎందున కనుచున్నా రా? మరల
నతఁడే

గీ. పూలు గోసికొన్న♦పొలఁతులతో నది
త్వరగఁ బురము చేరఁ ♦ బయన మైన

యంత మరుఁడు నాదు♦స్వాంతము శివశివ
తరిచి చీల్చి నూఱి ♦ తార్చి త్రిప్పె. ౨౨౮

వయస్యులారా! ఏమనుచున్నారు?

గీ. నిలుపు లేనిబుద్ధి ♦ గలవాని కొకవేళఁ
గలుగఁ గూర్కి దిగులు ♦ గలుగు దాన.

అనునది సత్య మయ్యెను. అనియా?

తర్వాత నడుమ నడుమ సవ్యాజవివలితముఖి యగునా సుముఖి నతిదూర మనుసరించి దానియింటివాకిటివఱ కనుగమించితిని. ఇంతలో

క. మనసిజుఁడు గారడం బటఁ
గనఁబఱచె మహాద్భుతముగఁ ♦ గామిని తనయిం
టిని జొచ్చె నైన నట నా
మనమున మఱి చొనిపె దాని ♦ మూనవిమహిమన్. ౨౨౯

అంతట వడి చెడనియన్నియొడలికడలకీలుముడులు గలిగి టక్కుపిక్కులకతలఁ గూర్ప నెఱుఁగక మున్నిటితెన్నున జడాశయుండై మొయిలువన్నియఁ బయోవాహుండై వానయదనుకొమరున ఘనమషీమలినాంబరుండై విలయానల మనఁ బ్రదగ్ధకాష్ఠావలియై ముక్కంటిజంట హుతాశనారుణలోచనుండై వెన్నునిపన్నిక భక్తానుకూలవ్యాపారుండై పాఁపతేనిపోలిక నుగ్రదర్శనుండై గరుడునివడువున నధిగతమహాసనుండై వెన్నదొంగ చెన్నున సంక్షాళితకంసమాలిన్యుండై రాముని గోమున మారీచమథనుండై వడముడిపోఁడిమిం దళితకీచకశతుండై వేలుపుదొరహరువునఁ బాకశాసనుండై మదపుటేనుఁగువితానఁ గరపిష్టనాగరుండై

వైయాకరణుకరణి విదితస్వరవ్యంజనక్రియుండై వైశేషికునిపాటున ద్రవ్యగుణక్రియావిశేషతత్సమవాయాభిజ్ఞుండై మీమాంసకునివరుస నర్థభావనాస్వరూపజ్ఞుండై సుకవిక్రియ విజ్ఞాతశిఖరిణీభేదుండై పండితునిమెండునఁ బరిచితసకలరసపరిపాకుండై కజ్జలమేచకుం డగుపాచకుం జూచి వానిని వసంతకునిముఖంబున నడుగఁ గడఁగిన స్వభావసరళుఁ డగుట దానినామకులశీలాదికము నంతయుం జెప్పె. ఎట్లన్న. ఈయమ మాస్వామి యగుమలయునికిఁ గోడలు. మాధవునిపెండ్లము. మందారునినందన. మంజరి యని పేరుగలది. ఇది నేఁడో జేపో బందుగులచూంతకై నవీననగరమున కరుగును. అట నున్నది తండ్రి యగుమందారునిమందిరము. అని.

వయస్యులారా! ఏమనుచున్నారు? పాచకునిపరమార్థవాదిత యచ్చెరు వైనది. ఆవల నావల. అనియా?

అంతఁ గొన్నిదినములలోపలనే యది యానవీననగరమునకు విచ్చేసెను. అందుమీఁద నేనును వచ్చితిని. పక్షపాతము లేక నావిషయమునవలె దానివిషయమునను గందర్పుఁడు దర్శితదర్పుఁ డగుచుండ భగవతి యగుజటావతి దానియంతరము నంతయు నెఱింగి యత్యంతానుకంపామయస్వాంతయై తనంతన తీర్థయాత్రాప్రసంగమున యమునాప్రతీరబృందావనమున ము న్నెఱింగిన నన్నుఁ జేరి నే నమస్కరింప నాశీర్వాదముల నభినందించి "వత్సా! ముకుందా! ఇందునియందుఁ గందుచందమ్మునఁ గందర్పసుందర మగుకలతోడ నీతనువునందుఁ దనుత్వము కందళించుచున్నది. ఇది యెందువలన? దారిఁ దాఁటటవలననా? లేక యిష్టబంధు వియోగకష్టముననా? మఱి మదనచేష్టితము

వలననా ?" యని మఱిమఱి యనుబంధించి యడుగసాగిన నేను నామనంబునన. "ఏమిది నన్నుపహసించుటకా? లేక యవమానించుటకా? మఱి నిగ్రహించుటకా? ఏమనుగ్రహించుటకా? యడుగుచున్నది. ఏమి? నే దీనియొడ దాఁతునా? లేక వివరింతునా?" యని యొక్కక్షణము చింతించి మఱియు మహానుభావుల కనుగ్రహమందె కాక యొంకుపనుల నభిని వేశ మేలయుండు నని నిశ్చయించి యాభగవతికి మొదటనుండి నామనోమదనవేదనను నివేదించితిని.

వయస్యులారా! ఏమనుచున్నారు? సఖుఁడా! చక్కఁగనూహించినాఁడవు. ఆవల నానల. అనియా?

అదియు నది విని "వత్సా! ఇట్లే పిన్ననాఁటనుండియుఁదొడపై నుంచుకొని నేఁ బెంచిన మందారసుత మంజరి నాతోఁజెప్పి బతిమాలుచు నీకడ కంపఁగా వచ్చితిని. విను దాని యవస్థ.

పళపళలాడు శ్వాసహతి ♦ బాలరసాలనవచ్ఛదాళి పూ
వులఁ గర మంటఁ గంది పడి♦పోవును వృంతసమేత మక్కటా
లలి నయనాంతవాంతసలి♦లంబుల దూర్వలు వాడుఁ గారుచి
చ్చలమినలీల నిష్కుటవ♦నాంతము గన్పడెఁ దన్వి చేష్టలన్.

అందుచే నోభద్రా! ఆబాల బలవదవస్థ గాన నుపేక్షిణీయగా" దని వచియించెను. నేను నాభగవతితో "ఈనే నా ప్రియురాలిసహజానురాగతరంగము లగు నపాంగములచేతనే ముం దమ్మను గొననుం దగినదశ నందింపఁబడితి. విశేషముగఁ బూజ్యుల రగుతమయనుగ్రహమువలన. కనుకఁ దమయిచ్ఛకు వచ్చినయట్లు నియోగింపుఁడు" అని పలికితిని.

ఏ మనుచున్నారు ? ఇప్పు డాభగవతిపై బరువు నుంచినవాఁడ వైతివి. ఆవల నావల. అనియా ?

అంత నాభగవతి నిట్టూర్చి.

క. సము లిద్దఱు సంపద రూ
పమునన్ లావణ్యమునను ♦ బలిమి సొగసుగూ
రుముల వృథా విధి మీఁకుఁ బ
రమశత్రువు గాఁగ నయ్యెఁ ♦ బ్రతికాలమునన్. ౨౨౭

అందున నీనిష్కారణవైరిచే విహస్యమాన మగు నాప్రయత్న మెట్లు శుభోదర్కము కాఁగలదు ? లేక త్రిలోకజేత యగుమనోజాతునివ్యవసాయమున కంతరాయ మొనర్ప నీకుటిలుఁ డగువిధి కెట్లగుఁ ? కాని కాని సమయముం గని పెట్టి కలిపెద." అని పలికి భగవతి యగుజటావతి గతవతి యయ్యె. అది మొదలామె బహువిధప్రయత్నముల నొనరించియు మదీయదుర్విధివిపాకము వలననే ప్రతిహతము లగుచు వచ్చె. నిన్న మఱి యాభగవతి యగుజటావతిప్రసాదమువలననే మందారనందనారామమున ప్రియతమ నాచేఁ జిక్కి నట్లయ్యెను.

ఏ మనుచున్నారు ? ప్రియసఖునిమనోరథము చిరకాలమునకు ఫలించె ననియా ?

(నిశ్శ్వాసముతో) లేదు లేదు. ఏ మన్న ఫలోన్ముఖ మగునంతలో భగ్న మయ్యెను.

ఏ మనుచున్నారు ? ఎట్లనియా ?

(దుఃఖమున)

ఉ. కోమలశాద్వలంపుఁబొదఁ◆కుం బద మందెను లేదొ నేర్పుమై
నే మటుచాటువాక్యముల ◆ నించుక యాడితి మొక్కొ లేదొ యా
సామిమనోగతప్రణయ◆సంజ్ఞలఁ జూచితి మొక్కొ లేదొ హా
భామినిభర్త లేచెఁ గద ◆ పాపవశంబున నంతలోపలన్. ౨౨౮

నేఁటివృత్తాంతమో ప్రియవయస్యులకు విదితమైయే యున్నది.

ఏమనుచున్నారు? కాని యింతమాత్రమున నే మైనది? ఈదినము నీకోరిక నెఱవేఱఁ గలదు. అనియా?

(వెడనవ్వు నవ్వి) నిజము నేఁడే ఫలించును. ఏల యన, ప్రియ తమ పతితోడం గూడి పయన మగుటం బట్టి.

ఏమనుచున్నారు? నీతిహామాత్రప్రేషిత మగుపత్త్రిక విస్మృత మయ్యె నేమి? అనియా?

(దిక్కులు తేఱి పాఱఁ జూచి) విస్మృతప్రాయ మైనట్టి. ఏలయన, ప్రదోషసమయముం గా వచ్చెనుగదా! చూడుము.

మ. త్వరముద్దుంగొని మైంద్రదిసస్మితముఖం ◆ బద్మాస్య సామోదఁగాన్
బరిరంభత్వరితాలసన్ దినరమన్ ◆ గావించి రక్తుం డహ
స్కరుఁ డాలింగితఁ జేయు వారుణదిశం ◆ గాశ్మీరకాశ్మోత్పయో
ధరభారం గద యిప్డు కాంత్యధికఁ గాం◆త నారిగిణిం దా నహా.

మఱియును

క. అంబరమునుండి రశ్మిక
దంబము ప్రాఁతవడి జాఱఁ ◆ దగ న స్తనగా
లంబన మంబురుహేశ్వర
బింబము గొని పట్టె నెదుట ◆ బింబఫల మనన్. ౨౩౦

ఇంతియ కాక

గీ. పవలు బహుళాతపాభిత♦ప్త మగుజగతి
తలము సలిలాభిషేకశీ♦తలము సేయఁ
గుటిలకటిధృతరవిశాత♦కుంభకుంభ
వచ్చె నిటఁ బశ్చిమాబ్ధికి ♦ వారలక్ష్మి. ౨౩౧

ఇంక నొకటి.

గీ. పడెను బడమటికడలిని ♦ వడి చెడి రవి
పథికహృది దర్పకమహాగ్ని♦బాగు గాఁగ
నడరె మిగులఁ దమఃప్రరో♦హం బదెట్టు
లడుగడుగున మనోవిమో♦హంబు నాకు. ౨౩౨

ఏ మనుచున్నారు?

గీ. మొదల సదవస్థితికి నభి♦భూతి సలిపి
జడజవితతికి సిరి నిచ్చి ♦ జగతి కెల్లఁ
దాప మొనరించునీరవి ♦ యేపగిదిని
జడధిఁ బడ కుండు సరసులు ♦ చల్లవడఁగ. ౨౩౩

అనియా?

(ఇంకొకవంకఁ బరికించి సకరుణముగ) అయ్యో! పాపము!

క. చరమాచరపరభాగము
సరసిజమిత్త్రుండు సేరఁ ♦ జనునంతఁ బర
స్పరము రథాంగపతంగము
లురుదూనము లగుచు దూర ♦ మొందెను గట్టా. ౨౩౪

(మఱియు నవలోకించి) ఏమిది భగవతి యగు జటావతి
యాతట్టే వచ్చుచున్నది! (ప్రశ్రయముతో) భగవతీ! ఇట

నిట. (ఇంచుక లేచి) ఓ భగవతీ! భుజంగశేఖరుఁడు నమస్కరించుచున్నాఁడు.

ఏమనుచున్నావు? చిన్నవాఁడా! బహుకాలమున కిప్పటి కభిమతలాభవంతుఁడవు గమ్ము. అనియా?

(నిర్వేదముతో) నాకుం గూడ నభిమతలాభ మెట్లు?

ఏమనుచున్నావు? ఈపూఁటనే గట్టెక్క నని తలఁపుము. అనియా?

(సంతోషముతో) ఎటువలె?

ఏమనుచున్నావు? మంజరి సగముత్రోవనుండి మరలి వచ్చినది. అనియా?

వయస్యులారా! ఏమనుచున్నారు? ఔరా! పురోహితపుత్త్రినిసత్యవాదిత! అనియా!

జ్యౌతిషికులకు వితథవాదిత యెట్లు గలుగును? (ఆశతోఁ దనలో)

గీ. అంతరమనోజదహనశి♦ఖావలీష
శ్వాసనసంరోధపాండుల♦సత్కపోల
వరమదీక్షాతుణభవన్న♦వరుచిపూర
తన్ముఖాబ్జము నెప్పు డెం♦తయును గందు. ౨౩౫

(ప్రకాశముగ) వయస్యులారా! ఏమనుచున్నారు? భగవతీ! పతియే మరల వెంటఁ బెట్టుకొని వచ్చె నేమి? అనియా?

భగవతీ! ఏమనుచున్నావు? కాదు కాదు. అనియా?

(ప్రమాదముతోఁ దనలో) అట్టయిన నామనోరథ మీడేఱినట్లే. (ప్రకాశముగ) ఎట్లు మఱి ప్రియురాలి రాక?

ఏమనుచున్నావు? వినుము. మాధవుఁడీమంజరిని వెంటఁ బెట్టుకొని యొకకోసుదారి యరిగినంతలోపలనే జనకుఁడగు మల యుఁ డంపినయుత్తరము సేరినది. అనియా?

ఏమని పంపెను?

ఏమనుచున్నావు? ఇట నిప్పుడు రాజకార్యోపద్రవమున శ్రీరంగనగరమును విడిచి మధురం జేరి యున్నాము. కనుక నవ శ్యముగ నామంజరి నటఁ గొన్నినెలలు తల్లియింట నుండ నియ మించి నీవుమాత్ర మీజాబుఁ జూచినమీఁద నిమేష మైన నాల స్యము సేయక రమ్ము అని. అనియా?

వయస్యు లేమనుచున్నారు? వయస్యా! అదృష్టమున నీకుల దేవతలు ప్రసన్నలైరి. అనియా?

(ఔత్సుక్యముతో) ఆవల నావల.

ఏమనుచున్నావు? అంత నామంజరిని దానిసోదరుఁ డగు స్వచ్ఛగుచ్ఛుని వెనుకకుఁ బుచ్చి చీటిఁ దెచ్చినవానితో సద్వితీ యుఁడై మాధవుఁడు తెరువుపట్టెను. అనియా?

(ఆశ్చర్యానందములతో)

క. చిత్తరి మృగాక్షి మగఁ డను
మిత్తివలన విడువఁబడెఁ జుమీ యెట్లైనం
దత్తమునినుండి వెడలిన
సత్తతిపతికళవితానసాహసరీతిన్. ౨౩౬

ఇప్పు డెచ్చట నున్న దా ప్రేయసి?

ఏమనుచున్నావు? భద్రా! భవద్విరహవిహ్వల యగు మంజరిని మార్గశ్రమఖిన్నఁగా నెన్ని మరాళికం దోడిచ్చి మంది

రమునఁ నేఁడించి మందారుఁడు సకలబంధుకులసమేతుఁడై కాళికా రాధనకై బాహ్యోద్యానగతుం డయ్యెను. అనియా?

భగవతీప్రసాదమున నిదియు నింకొక యనుకూలము. (క్షణ మాత్రము చింతించి)

భగవతీ! కలహంసకమయూరకులంగూర్చి యే మనుచు న్నావు? వత్సలారా? వత్సలారా! అదృష్టమున మీమనో రథములును ఫలింపఁగలవు కనుక నవశ్యముగఁ గోరినవిషయ ములఁ బ్రయత్నింపుఁడు. అనియా?

మయూరకా! ఏ మనుచున్నావు? కలహంసకునకుఁగమ లిని చేతఁ జిక్కినదియే యై యున్నది. మందభాగ్యుఁడ నగు నాకో ప్రకృతిచపల యగుసౌదామిని యెట్లు ప్రసాదించును? అనియా?

భగవతీ! (మరల ధ్యానించి) ఏ మనుచున్నావు? మయూ రకా! నిన్న మేలుకొని యున్న గురుజనమునకు దిగులుపడి సౌదామిని వెనుకఁ ద్రొక్కెను. ఈరేయి యట్లు చేయదు అనియా?

వయస్యు లేమనుచున్నారు? ఎట్లు జరుగునో తెలియ రా కున్నయది. అనియా?

ఏ మిది భగవతిమాటయందును సందియమా? (వినుట నభి నయించి) ఏ మిది? పాదశబ్దమువలె వినఁబడుచున్నది. (చూచి) మరాళిక తీవ్రముగ వచ్చుచున్నయది.

భగవతీ! ఏ మనుచున్నావు? భద్రా! ఇప్పు డసహ్యావేదన యగునాచిన్నదియే దీనిం బుచ్చి యుండును. అనియా?

(మఱియుం గని) ఏమిది ప్రత్యాసన్నరా లయ్యెను!

ఏమనుచున్నావు? తడసెద రేమి?

క. చెలి మధురసవివశసిక్తో
జ్జ్వలమదనాస్త్రహతగాఁగఁ ♦ బైఁబడి మలయా
నిలహతకుఁడు జీవితశం
కల సలిపెడు శివ శివ సతి♦గతి యే మగునో. ౨౩౭

ఎక్కు వేల సెప్పవలయును?

ఉత్సాహ. కడిగి కడిగి మంచునీటఁ ♦ గంటి దానిఁ గన్నులం
గుడిచి కుడిచి చంద్రఘుటికఁ ♦ గొనకుఁ జెప్పుదు నాదటన్
విడక చందనచ్ఛదాళి ♦ వీచి వినుము వీనుల
న్మడఁతి బ్రతుకు మీకయిం బ్ర♦మాణ మింకఁ దా రిటన్. ౨౩౮
అనియా?

భగవతీ! ఏమనుచున్నావు? త్వరపడుము త్వరపడుము తుషారకరుఁ డుదయశిఖరిశిఖరము నధిరోహింపక మున్న. అనియా?

ఔ నదియ తగును. తిమిరతిరోహితసమయముననే స్వైరిణులం జేర నరుగ వలయును.

క. మెండుకొని కటికిచీఁకటి
మండలి కారుకొని నిండ ♦ మహి నెల్లెడలం
గాండజభాండమండల
మొండుగఁ గజ్జలకరండ♦మో యన వెలసెన్. ౨౩౯

కలహంసకా! ఏమనుచున్నావు?

ఉ. అందఱు దీని ధ్వాంత మని♦యందు రనేకత నిశ్చయించితి
న్నందత జాతి సూర్యకర♦మండలి తన్ను వహించి యస్తముం
బొంద నభం బిలం బమచుఁ ♦ బూర్ణత లోకముఁ గ్రమ్మ నున్నిష
త్కందలచంద్రరశ్ము లవి ♦ గ్రక్కున నెత్తె నిజం బటంచు నేఁ.

వయస్యా! బాగుగ నుత్ప్రేక్షించితివి?

మరాళికా! ఏమనుచున్నావు? దేవరా!

గీ. మదనమలయజమారుత♦మదపికాళి
కలకలాకులమతిగతి ♦ గద మదాళి
కలిగినను నెల వెన్నెల♦కరడు లడర
నకట దవహతలతభాతి ♦ నగు నిజంబ. ౨౪౧

అందువలన నీలోపల నీకౌఁగిటం బడ నిమ్ము. త్వర త్వర. అనియా?

ఓకలహంసా! ఓయిమయూరకా! భగవత్యుపదేశక్రమమున వ్యాపారింతురు గాక. ఈ భగవతియు మరాళికయు నన్నుఁ ద్వరపఱచుచున్నారు.

ఏమనుచున్నారు? మఱేమి? సరియే వయస్యా! సెలవు పుచ్చుకొమ్ము. అనియా?

మరాళికా! మందారసదనమార్గము నాదేశింపుము.

ఏమనుచున్నావు? దేవరా! ఇటులిటులు అనియా?

(కొన్ని యడుగులు గడచి) ఏమిది నిమిషమున మందారోద్యానమునే చేరితిమి! (విస్మయముతో) ఏమిది యిట నెల కలుగకయే వెన్నెల పొలయుచున్నయది!

మరాళికా! ఏమనుచున్నావు? ఇది వెన్నెల పొలయిక
గాదు. మ తేమనిన.

గీ. హర్షనిర్భరాంగి ♦ యగునాతి నినుఁ జూచి
నంత దేవ మివ్వుల ♦ సంతసంపు
మొలక లొదవునట్లు ♦ మో మనుతామర
మందహాసరుచులు ♦ గ్రందుకొనియె. ౨౪౨

దీనిం జూడుము చూడుము.

క. వాణి సుమధురసవేణియె
వేణియొ మధుమత్తమధుప♦విశ్రేణి యగుక్
ష్మోణీవిపులశ్రోణి య
దేణాక్షియె మదనబాణ♦ధృతతూణి సుమా. ౨౪౩
అనియా?

భగవతీ! ఏమనుచున్నావు? అవు నది.

చ. మృదుమృదు లౌ తదంగముఖ♦వృత్తకళల్ విధిచేకటుత్వముక్
మదిఁ గలకౌల్యము న్వరుస ♦ మద్ధృదయంబు విమర్శ సేయఁగాఁ
బద మిడె నిట్లు నామదిని ♦ బద్మభవుం డపు డాదిఁ బుణ్యసం
పదవలన న్రచించె నిటు ♦ బాఢము శోభనగాత్రి దీని నాక్.

కనుక నుపసర్పింపఁ దగు వత్సుఁడు అనియా?

(ఉపసర్పించి చమత్కారముతో)

క. కాలాహికోకదంపతి
లీలాప్రణయంబు దొంగి♦లింపఁగ భీతిక్
బోలె శశి నెమిలిఁ బ్రక్కన
చాలఁగ నాడించుఁ జిత్ర♦సంగతి యిది యహా. ౨౪౪

మఱియును

క. స్తనదుర్గరాజధానుల
కును ద్రోవ న్నక్షతము బొడ్డు♦కొలకును న్కటి నా
రనుచా ల్తమూలవనరే
ఖను మదనుఁ డొనర్చె నేమి ♦ కాంతామణికిన్. ౨౮౬

మరాళికా! (సిగ్గుచే నించుక కలఁత నొందినట్లున్న మంజరిం గూర్చి) ఏమనుచున్నావు?

క. దూరముగఁ బంపు సిగ్గను
జారుముఖి నెమ్మిఁ జెనుచు ♦ సత్వర మది స
స్మేరాననుఁడుగఁ బ్రియుఁ డిటు
చేర విముఖిఁ జేసె నిన్నుఁ ♦ జెనునడతమెయిన్. ౨౮౭

అనియా?

ప్రియా! ఏమనుచున్నావు? చెలీ! ఈమాయావి యగు మహాభాగుఁడు నాకంటికెదుటఁ బడినప్పుడ వెంటనే కులవృత్తముం గలసికొని యాలజ్జ దూరముగఁ బఱువెత్తెను. అనియా?

(నవ్వుతో) మరాళికా! ఏమనుచున్నావు?

క. అనువర్తించుము స్వైరగ
తిని నంబచు నార్యు ననుస్మృ♦తిం గొని స్వైర
త్వనిరూఢిఁ దిరుగు నీ వం
గన కులవృత్తంబు మాఁపఁ♦గా లేదు సుమీ. ౨౮౮

అనియా?

ప్రియా! (కర్ణోత్పలమున మరాళికం గొట్టుచు) ఏమనుచున్నావు? ఓసీ! తల్లినిగూడఁ దాఁకెద వేమి? అనియా?

భగవతీ! ఏమనుచున్నావు? కులవృత్తమా! నూఱేండ్ల వఱకుండనే యుండును. కాని దీనియీకోరినవిషయము దొరకఁదగినది కాదు. అనియా?

భగవతియాన వింటివా? ప్రియురాలా! (నవ్వుచు) ఏమనుచున్నావు? కేవలము వినుట మాత్రము కాదు. ఆచరింతును గూడ. అనియా?

ఏమిది భగవతియుపదేశమునఁ బ్రేయసి యకలంకహృదయ యయ్యెను! భగవతీ! ఏమనుచున్నావు?

క. వినుమీ రిరువురు నైజము
గ నిరూఢప్రేమబంధ♦కలితులై యట్లై
నను నే నిశ నైతిని జం
ద్రుని గైరవలతను గూర్పు♦త్రోవఁ జులకగాఁ. ౨౪౯

ప్రియురాలా! ఏమనుచున్నావు? ఇదిగోఁ జంద్రబింబ ముదయగిరి నుదయించుచున్నది. అనియా?

గీ. ఓవరానన వెలయఁగ ♦ నీవరాస్య
మెంచఁ జంచలకలితదృ♦గంచలముల
నిందు వంబుధిబిందు న ♦ దేల నాకు
సింధు వాతనిబంధువు ♦ చెప్ప నేల. ౨౫౦

(తూరుపుదెసం గనుంగొని) విరహిజనప్రాణజగత్ప్రాణఫణి యగుహారశిరోమణి యుదయించుచున్నాఁడు. ఎట్లన

గీ. కరము కరములఁ గలిత మం♦బరము నొడిసి
పద్మకోశపయోధర♦భరము నులిమి

వికసదుత్పలనేత్రసం♦వీక్షితుఁ డయి
చెలియ చంద్రుఁడు నిశ సర♦సీకరించు. ౨౫౧

మఱియును

గీ. అబ్జుఁ డుదయింపఁ గని పొంగి ♦ యంత నిండు
కరములను మీఱు వెలిపాల♦కడలి వెడలి
కడల నడరినపరమాణు♦గణమె చంద్రి
క లనురూపుఁ దెల్లఁగా ♦ సలిపె జగము. ౨౫౨

భగవతీ! ఏమనుచున్నావు?

మ. పరుషార్కాయతశాణచక్రకషణా♦పాత్యభ్రకాలాయసో
త్కరచూర్ణంబుతమం బటంచు నభిధం♦గాంచెన్ ధరం జంద్రదం
భరసోదంచితసిద్ధబిందుకలన ♦ న్భాసించె నాధూళి రూ
ప్యరజఃప్రాయముగాఁగఁ జెప్పెదము మే♦మా వెన్నెలన్రాత్రిగాన్.
అనియా?

నేనిట్లూహించెద.

చ. సమయకిరాతుఁ డభ్రభవన♦చారి సుధాశనముఖ్యకాహితా
త్యమృతమయాబ్జబింబమధు♦హారిమహాపటలంబుకై కలం
క మనుపొగం దవిల్చి మఱి ♦ కమ్మనివెన్నెలతేనెఁ బిండి యీ
క్షమ యనుపాత్రమందునిచెఁ ♦ జాలఁగ దానినిద్రావఁదృప్తిగాన్.

ఇంతియ కాదు.

గీ. కాలభుజగంబు గఱచ జ♦గచ్ఛరీర
మంధకారపుమిష విష ♦ మాక్రమింపఁ
జంద్రమణి ద్రావి జాతల♦క్ష్మముగ ధాత
చంద్రికాక్షీరమున శుద్ధి ♦ సలుప నుంచె. ౨౫౩

లేక,

గీ. ఆయతాగ్రకనితరశ్మి ♦ కాసిబద్ధ
రచితలాంఛనరుచిమషీ ♦ రసవిలేప
చంద్రదదంభమరుత్పట ♦ చక్ర మొండు
విడిచె స్మరభాలుఁ డాడఁగఁ ♦ గడఁగి యేమి. ౨౫౬

మఱియును

మ. హరిదికన్యార్భకయందు నించి తిమిరం ♦ బన్నందుచూర్ణంబు వే
సర కుద్గత్వరతార్కకామయవిభా ♦ స్వ్రద్రంజకోద్యత్స్ఫులిం
గరమం బూర్వగిరీంద్రదుర్గగతుఁడై ♦ కాలుండు గాల్పన్ నిశా
వరదంభంబున వచ్చి వృత్తశిల యీ ♦ పాంథావళిం జంపెడిన్.

లేక యిది చంద్రబింబము కాదు.

క. గరళోదర మమృతము శం
బరవైరియె పంచెఁ జంద్ర ♦ మండలమిషఁ నం
తరనీల మగు బహిస్సిత
మరసినమాత్రమునఁ గాల్చు ♦ నాప్రోషితులన్. ౨౫౭

ఓసీ! ఏ మనుచున్నావు? మహాభాగుల రగుతాము సత్యమే పలుకుదురు. విరహిజనుల కీతఁడు నిసర్గవైరి గదా! అనియా?

మరాళికా! ఏ మనుచున్నావు? చంద్రుఁడు స్వభావశీతలుఁడే మఱి యెట్లు తపింపఁజేయును. అనియా?

సత్యమే. ఐనను

గీ. మారవైరియగ్ని ♦ మయనేత్రమును జిరా
శ్రయణమునను మోస ♦ నలిపి యొకట

దాన నపహరించి ♦ దాహశక్తిని శశి
గాల్చు నిట వియోగి♦గణము నిజము. ౨౫౯

(విమర్శాపూర్వముగ) ఆహా! చిరకాలముగ వీనిచేఁ జిక్కి-యుక్కిఱితిమి గదా! కనుక నేఁడు ప్రియాసాహాయ్యమున నసంజాతభీతినై వీని నుపాలంభించెద. చంద్రుం గూర్చి

గీ. ఖండములుగ నఱుకుఁ ♦ గాలుండు నీయమృ
తంపుమండలంబుఁ ♦ దగ హిమకర
పథికహననజాత♦పాతకసదృశ మా
దండ మదియె నీకుఁ ♦ దలఁచి చూడ. ౨౬౦

నీవడతం గని విసిగిననీజనకుఁడే నిన్ను దినదిన ముపాలంభించున దెట్లన.

గీ. విప్రయోగిహతికి ♦ వృథ నాకడుపునందుఁ
బుట్టి తెట్టు లనుచుఁ ♦ బొరలి కడలి
యురము నుద్యదూర్మి♦కరత మోఁదుచు రోద
నలుపు నీదుపుట్టు♦కలను జంద్ర. ౨౬౧

భగవతీ! ఏమనుచున్నావు? అట్లు కా దట్లు కాదు. హిమకరమదనమలయానిలాదులు లోకానుగ్రహమాత్రతత్పరులుగదా! అందున వా రుపాలంభనీయులు కారు.

గీ. కామినీకాముకులమనః♦కనక మార
నెల కలాదునివలెఁ గాఁచి ♦ నీరు గాఁగఁ
గరఁచి మలయానిలైధిత♦కామవహ్ని
రాగటంకణమున నేక♦రస మొనర్చు. ౨౬౨

అనియా?

(ప్రశ్రయమున) అట్లైన నమస్కరించెదం గాక.

క. ఇందునిఁ గరాంకురకృతా
నందేందీవరవిలాసు • నయనోల్లాసున్
బృందారకజీవాతువు
వందన మొనరింతు నే శి•వశిరోమణిసున్. ౨౬౩

(విన్న ట్లభినయించి) చంచూపుటచంచచ్చంద్రచంద్రికా మధురనాదములఁ జకోరకము లే మనుచున్నవి ?

క. ఇందీవరసంపద నా
యిందుఁ డటు శరచ్ఛతంబు • నీకుంజరి నా
నందింపింపు ముకుందా
యందంబున నీవు సుఖము • నందుచు నెపుడున్. ౨౬౪

అనియా ?

భగవతీ! ఏ మనుచున్నావు ? అట్లగుం గాక యనియా ?

(అడఁకువతో) అనుగ్రహింపఁబడితిని.

(మఱి) ఏ మనుచున్నావు ? నీకొఱ కిం కేమి ప్రియ ముపకరింపవలయును ? అనియా ?

(ప్రశ్రయానందములతో) ఇంతకన్నఁ బ్రియ మే మున్నది ?

మ. పురబాహ్యస్థలిఁ దండ్రి బందుగులతోఁ • బో నుత్సవార్థం బిటన్
గర మాకారముఁ గొన్న విఘ్న ముగుత•త్కాంతుం డతం డేగ సుం
దరి తా నచ్చి భవత్ప్రసాదమునఁ జే • దక్కంగ నిం కే ప్రియం
బరయంగా నగు నింతకన్న మఱి ధ•న్యాత్ముండ దేవీ యికన్.

ఐన నిది యగుం గాక భరతవాక్యము.

గీ. వారివాహవితతి వర్షించు మిగుల గో
బ్రాహ్మణులకు మేలు పరఁగు ధరణి
సుకవికృతుల ముదము సుజనులు గాంతురు
సడలుఁ దత్ఖలోపసర్గములును. ౨౬౬

## కవివాక్యము.

క. ఆనందితసుకవి ముకుం
దానందసమాఖ్యభాణహర్షితుఁ డగుచుం
బూని రమాకమనుఁడు బహు
మానము గొల్లలుగఁ జేయు మంగళ మెప్పుడున్.

చ. అతులదయాప్రసన్నహృదయాబ్జరసజ్ఞబుధేంద్రు లేరు నా
కృతి సదలంకృతిం బహుళరీతిసమేత బహూకరింతు రా
యతిని దదీయపాదకమలార్చకు నేను సరోజకుట్మలా
కృతిని బ్రణామకాంజలిని గేనల ముంతు సతంబు నౌదలన్.

## గద్యము.

ఇది శ్రీమత్కౌండిన్యకులతిలక శ్రీమదుమాపతిసుధీ
తనయ కాశీపతికవి విరచిత ముకుందా
నందభాణాంధ్రీకరణము
సంపూర్ణము.

